# సాహిత్య మాస పత్రిక

వెల రూ॥ 4-00 నవంబర్-199



దక్షిణ భారత
హిందీ ప్రచార సభ-
ఆంధ్ర,హైదరాబాదు.

# సంతాపం



జె. దొరస్వామిరెడ్డి

శ్రీ జె. దొరస్వామిరెడ్డిగారు 1-7-1924న బంగారుపాళ్యం నల్లంగాడు నందు జన్మించారు. పామర్రు విద్యానసాన హిందీని అభ్యసించారు. 1951 నుండి 1983 చిత్తూరు జిల్లాలో అరగొండ పూతలపట్టు, బంగారుపాళ్యం సి. జి. యం. పలకనేరు మున్నగు ప్రదేశములలో ఉన్నత పాఠశాలలో హిందీ బోధించడమేగాక సభ పరీక్షలకు ఎంతోమంది విద్యార్థులను పంపించారు. వీరి శిష్యులెంతో మంది ప్రస్తుతము హిందీ ప్రచారకులుగా నున్నారు

ద.భా హిందీ హిందీ ప్రచార సభ వ్యవస్థాపితా సమితి సభ్యులు. రాయలసీమ ప్రాంత శిక్ష సంగటకులు. చిత్తూరుజిల్లా హిందీ ప్రచారక మండలి అధ్యక్షులు—బాలభటోద్యమమున పేర్కొనదగిన కృషి సాధించిన ధన్యజీవులు—

23-10-94వ ఉదయం హిందీ విద్యార్థులకు యథోచిత సలహాలిచ్చి వేలూరి సి ఎమ్.సి. హాస్పటలుకు వెళ్ళారు. 24-10-94 సూర్యోదయాత్పూర్వం కన్నుమూశారు.

టెలిగ్రామ్: హిందీసంఘ

ఫోన్ : 316865

488

# నవం

## సాహిత్య మాసపత్రిక

నవంబర్–1994

సంపాదకులు

శ్రీ వేమూరి ఆంజనేయ శర్మ

శ్రీ ఈమని దయానంద

శ్రీ అన్నదానం శంకరశాస్త్రి

**దక్షిణ భారత హిందీ ప్రచార సభ–ఆంధ్ర, హైదరాబాదు–4**

959, ఖైరతాబాద్ హైదరాబాద్–500 004

సంవత్సర చందా

40–00 రూ॥

విడిప్రతి

4–00 రూ॥లు

Recommended for use in all the Public libraries and School Librariesby the Director of Public Libraries, Andhra State, Madras, Vide proceedings is No. 30/55 dated 6th January-1955.

---

# ఈ సంచికలో

సంపాదకీయం

# ఆదాన ప్రదానము

విశ్వసాహిత్యమంతా ఒక్కచోటికి చేరుతున్న రోజులివి సంచార సాధనాలు పెరిగినవి. విశ్వంలో ఎక్కడ ఏ పెద్ద సంఘటన జరిగినా, ఎలక్ట్రిక్ సాధనాలు రేడియో,దూరదర్శన్ వంటి సాధనాల సహాయంతో లోకమంతటా తెలిసి పోతున్నది. సాహిత్యం స్థితి గూడా అలాగే వున్నది. విశ్వసాహిత్య రంగంలో వివిధ భాషల్లో అనేకమైన విశిష్ట కృతులు వెలువడుతున్నవి. ప్రతిభావంతులైన రచయితలు ఎంతో మంది రచనలు చేస్తున్నారు. ఇంగ్లీషు భాషకు గల ప్రత్యేకత ఏమంటే ఆ రచనలు ఎక్కువ సంఖ్యలో ఇంగ్లీషులోనికి అనువదించబడుతున్నవి. ఇంగ్లీషు భాష వ్యాప్తిలో వుండడానికి ఇది ఒక కారణం. ఎక్కడ ఏ భాషలో సైన్సు, సాహిత్యము వంటి రంగాలలో ఏ విశిష్టకృతి వెలువడినా అది అనతి కాలంలోనే ఇంగ్లీషులోనికి చేరుతున్నది. అందుకు ఇంగ్లీషువారు చేస్తున్న కృషి ప్రశంసనీయమని చెప్పక తప్పదు. రాజకీయంగా వారికి కొన్ని సౌకర్యాలు లభించడం. వివిధ దేశాలలో వారు ప్రభువులుగా వుండి ఆ దేశాలలో ఇంగ్లీషు భాషను ప్రచారం చేయడం గూడా అట్టి వాతావరణం ఏర్పడడానికి దోహదం చేసింది. ఏమైనా విశ్వసాహిత్యం అన్ని భాషలకంటె ఎక్కువగా ఈనాడు ఇంగ్లీషు భాషలో లభిస్తున్నది,అది సత్యం. ఆ స్థితి భారతదేశంలోని మన భాషలకు గూడా లభించడం వాంఛనీయం. అవసరం భారత రాజభాష అయిన హిందీలో ఆ ప్రయత్నం ప్రారంభమైనా-పుస్తకప్రచురణ జరుగుతున్నా చెప్పుకోదగినంతగా ఫలితం సాధించబడిందని చెప్పలేము. విశ్వ సాహిత్యం మాట అటుంచి భారతీయ భాషల్లో వెలువడిన కృతులనే మనమెరగని స్థితిలో ఉన్నాము. భారతీయ భాషల్లో ఈనాడు ఎన్నో ఉత్తమ రచనలు వెలువడు తున్నవి. అన్నిరంగాలలోనూ ప్రతిభావంతులైన సాహిత్య నిర్మాతలు పుంఖాను పుంఖంగా రచనలు సాగిస్తున్నారు. కాని ఆ రచనల్ని ఆ భాషలు మాట్లాడేవారు తప్ప ఇతరులు తెలుసుకొనలేక పోతున్నారు. ఇది ఈనాటి దుస్థితి. సాహిత్య రంగంలో స్వతంత్ర రచనలకు మౌలిక రచనలకెంత ప్రాముఖ్యత వున్నదో అను

వాద సాహిత్యానికి గూడా అంత ప్రాముఖ్యత ఏర్పడివున్నది. అనువాద సాహిత్య నిర్మాణం జరగడం, ఒక భాషనుండి ఇంకొక భాషలోనికి విశిష్టకృతులను అనువాదంద్వారా తీసుకొనిరావటం ఎంతైనా అవసరం. అందుకు కొన్ని సంస్థలు ఏర్పడి పనిజేస్తున్నా జరగవలసినంతపని జరగటం లేదు. అసలు భారతీయ భాషల సాహిత్యాన్ని గమనిస్తే సంస్కృత కృతుల అనువాదాలతోనే అవి ప్రారంభమైనటు కన్పిస్తున్నది సంస్కృతగ్రంధాలు,పురాణాలు, నాటకాలు ఎన్నో ప్రాంతీయ భాషల లోనికి అనువదింపబడినవి ఆ తరువాత స్వతంత్ర రచనలు వెలువడినవి. మొదట వెలువడిన అనూదిత రచనలు గూడా స్వతంత్ర రచనలవలెనే రూపుదిద్దుకొన్నవి. కవులు, సాహిత్య నిర్మాతలు తమపాండిత్య ప్రతిభచేత ఆ పని చేయగలిగారు భారత భాగవత రామాయణాలు అందుకు నిదర్శనాలు. పురాణ గ్రంధాలు అందుకు ఉదాహరణలు. ఈనాడు సాహిత్య రంగంలోనూ, ఇతర రంగాలలోనూ వైవిధ్యం పెరిగింది. కావ్యాలు, నవలలు, నాటకాలు కథలు రచింప బడుతున్నవి. అనేక శాస్త్రగ్రంధాలు వివిధ విషయాలపై వెలువడుతున్నవి. ప్రతిభ ఏఒక్కరిసొత్తూ కాదు. అది ఏ ఒక్క భాషకు చెందినవారిదీ కాదు ప్రతిభ దైవదత్తం. పురాకృత జన్మ ఫలం వలన అది లభిస్తుందని గూడా పెద్దలు అంటారు. ప్రతిభావంతులైనవారు నిర్మించిన ఉత్కృష్టమైన కృతులనన్నింటినీ వివిధ భాషలలో అనువదించడం చాలా అవసరం. ఈ కృషి ఒక ఉద్యమంగా జరగాలి. దీనినే మనం ఆదానప్రదానోద్యమం అంటున్నాము కనీసం భారతీయ భాషలలోని వివిధకృతులు హిందీలోకైనా అనువదించబడగలిగితే ఆ భాషామాధ్యమం ద్వారా ఆకృతులను వివిధ భాషల లోనికి అనువదించే అవకాశం కలుగుతుంది. అనువాదం తేలికపని అని కొందరంటుంటారు. అది నిజంగాదు. అనువాదం చాలా కష్టసాధ్యమైనపని. అందుకు ప్రత్యేక ప్రతిభ అవసరమవుతున్నది. ఆదాన ప్రదానోద్యమానికి అకాడమీలద్వారా, తదితర సంస్థలద్వారా, ప్రతిభావంతులైన అనువాదకుల స్వయంకృషి ద్వారా, కృషి ఎక్కువగా జరగవలసి వున్నది. కనీసం భారతీయ భాషాసాహిత్యాన్నైనా ఒకచోటికి చేర్చగలిగితే కొంత పనిని సాధించినట్లవుతుంది. ద్విగుణీకృతోత్సాహంతో ఆ పని జరగగలదని ఆశించడం అనుచితంగాదు.

# సాహిత్యవీధి

## జానపద గేయాలు–సామాజిక నేపథ్యం

చింతల సత్యనారాయణ

ఆధునిక సాహిత్యంలో 'జానపదం' అన్న పేరు స్థిరపడింది. ఈ పేరు వినగానే గుర్తొచ్చేది జానపదగేయాలు. (పాటలు) ఆత్మానందంకోసం ఒకవిధంగా, శ్రమను మరవడానికి మరోవిధంగా ఈ పాటలు పుట్టుకొచ్చాయి. అజ్ఞాత కర్తృత్వం, సామూహిక ప్రచారం, మౌఖిక సంప్రదాయం ఈ గేయాల ముఖ్యలక్షణాలు.

"అవ్యాజాలైన ఆశయాలతో, మృదుమధురమైన పలుకులతో, సరళమైన నడవడితో ఈ గేయాలు కొనసాగుతుంటాయని" గిడుగు సీతాపతిగారు పేర్కొన్నారు. ప్రతి మనిషిలో తనకు తెలియకుండానే కొన్ని ఆశయాలు దాగివుంటాయని, మనిషికి జ్ఞానం లేకున్నప్పటికీ భాష మాత్రం వుంటుందని, ఆ భాషయే భావరూపంలో వ్యక్తం అవుతుందని గిడుగువారి అభిప్రాయం.

"ఈ జానపదగేయాల రచన కలంతో కాదు కన్నీటితో, విరహంతో, ఆశలం గుండెయందు దాగే రచన అని నార్ల పేర్కొన్న అభిప్రాయం ఈ గేయాల పుట్టుక, స్వరూప, స్వభావాలను తెలియజేస్తుంది. "ఆటోపం, ఆడంబరం లేని అలంకారాలు, అసత్యాలు లేని పల్లెహాస్యాలు ఈ గేయాలలో అపూర్వక ధోరణిలో కొనసాగుతుంటాయని, అందరికి అర్థమయ్యేలా వుంటాయని" తాపీ ధర్మారావుగారు పేర్కొన్నారు.

"ఏ అజ్ఞాత మృదుమధుర హృదయస్పందనం దానిలో రూపు నిలుపుకుందో తెలియదు. అదికేమవ శ్రీనాధుడు మొదలు వీధి బిచ్చగాళ్ళుకూడ జానపద కవులు. జానపదులు రచించిన గీతలు జానపదుల కోసం" అన్న విద్వాన్ విశ్వంగారి అభిప్రాయం ఈగేయాల వికాలనేపథ్యాన్ని, మౌలిక స్వరూపాన్ని తెలుపుతుంది.

ఈ గేయాలు మౌఖిక సంప్రదాయంలో కొనసాగుతుంటాయి. సామూహిక ప్రచారం, ప్రసారం, పునఃసృష్టి ఈ గేయాలు రూపొందడంలో, లో ప్రధానపాత్ర వహిస్తాయి. ఈ గేయాలను పాడే ప్రతిఒక్కరు (దాదాపుగా) ఏదో ఒక చరణాన్ని

---

లెక్చరర్, తెలుగు డిపార్ట్‌మెంట్, ఆర్ జి కేడియా డిగ్రీ కాలేజ్, ఛాదర్‌ఘాట్, హైదరాబాద్.

మరచిపోవడం, వెను వెంబడే వేరే పదాన్ని చేర్చడం చేస్తుంటారు. ఈ గేయాలు మనిషికి తెలియకుండా అతని ప్రతిభ వల్ల బయటపడతాయి.

జానపదులు స్వేచ్ఛను తమ ఇష్టానుసారం వాడుకుంటారు శిష్టసాహిత్యంలో ఇవి రాణించలేక పోయాయి. పట్టుదల, ఆతృత, ఆరాటం జానపదు నికి లేవు. మనసిక పరమైన బాధలను మరచి పోయేందుకు, భౌతికంగా విశ్రాంతిని పొందేందుకు, సమాజంలో ఒక్కమనిషిగా మనుగడ సాగించేందుకు జానపదుడు పాటలను పాడుకుంటాడు ఈపాటలను కథాసంహితం, కథారహితంగా కాకుండా వస్తువు ననుసరించి, రసాన్ననుసరించి, వీరగాథల పరిణా మాన్ననుసరించి విభజించడానికి వీలుంది. అన్ని రకాల గేయాలను కలిపి ఈ క్రింది విధంగా చెప్పుకోవచ్చు

పనిపాటలు—భక్తిరసగేయాలు—స్త్రీలపాటలు— వేడుకపాటలు— శృంగారగేయాలు— హాస్యరస గేయాలు- కన్నీటిపాటలు- తాత్త్వికగేయాలు మొదలైనవన్ని జానపద సాహిత్యంలో చోటు సంపాదించుకున్నాయి. వానపాటలు, ఏరువాక పాటలు, కలుపుపాటలు, కోతపాటలు రోకటిపాటలు ఏతంపాటలు మొదలైనవన్ని పనిపాటలుగా పరిగ ణిస్తారు. గంగుల సాయిరెడ్డి కంఠంనుండి వెలువడిన ఈ గేయం తెలంగాణాలో పేరు ప్రఖ్యాతులను సంపాదించుకుంది.

''ఏటికేతంబెట్టి ఎయిపుట్లువండించి—ఎన్నడు మెతుకెరుగరన్నా—నేను గంజిలో మెతుకెరుగరన్నా

కాల్జేజి కడుక్కోని కట్టమీద గూసుంటే-కాకి

దన్ని పోయేరన్నా-కాకి దన్ని పాయేరన్నా

పోదుకూ చాల్లేక పొయికాడ గూసుంటే-పోరి

దన్ని పాయేరన్నా—పరిత దన్ని పాయేరన్నా

చుక్క పొద్దునలేచి బొక్కెనెత్తుకపోంగ—

బొక్కబోర్లాపడితి రన్నా—నేను పక్కలిరగా పడితి రన్నా

నాదేటి బ్రతుకాయరన్నా—నేను నాడె సావక పోతిరన్నా''

ఈ గేయం కరుణరసాత్మకంగా కనబడి నప్పటికి ప్రతీకాత్మకత ఏమాత్రం తీసిపోలేదు. పంట పండించే రైతు ఆవేదననుండి ఈ పాట వచ్చింది. రెక్కలు ముక్కలు చేసుకొని రేయిం బవళ్ళు చెమటోడ్చి పంట పండించినప్పటికీ తిన డానికి తిండికి (అన్నానికి) నోచుకోని దౌర్భాగ్యని పరిస్థితియే ఈ పాట భావంలోని కాకి యజమానికి ప్రతీక అయితే, కాకిపిల్ల యజమాని కొడుకుకు ప్రతీక, నిరాశ నిస్పృహలకు, చావుబ్రతుకుల జీవన పోరాటాలకు ప్రతిబింబం ఈ గేయం.

రాయలసీమలో జీవనపోరాటాన్ని తెలిపే గేయాలనేకం వున్నాయి.' ఓడలు బండ్లవుతాయి— బండ్లు ఓడలవుతాయి' అన్నట్లు ఒకప్పుడు రాయల సీమలో రత్నాలను రాసులుగా పోసి అమ్మేవారని చెపుతుంటారు. అలాంటి రాయలసీమలో ఈనా డున్న పరిస్థితులు ఎవరికి తెలియంది కాదు. మాన వుల హృదయాలను ద్రవింపచేసే ఈ గేయాలు ఎంతో ప్రాముఖ్యాన్ని సంతరించుకున్నాయి.

'రాల్ల సీమను కరువుకాటేస్తే

తల్లి వేరుల్లో సీరెండిపోతది

చెట్ల కొమ్మల్లో చిగురెండిపోతది

రెక్కలు మొలవని గుడ్డులోని బిడ్డలు

గిలగిల తన్నుకొని నేల కొరిగిపోతాయి

పశుల జంటలన్ని పాసిపోయి బతుకుతాయి'

'మాను మాను పువ్వుగాచె—మాను కింద రాశి
పోసె
ఇప్ప మాను పువ్వుగాచె—ఇప్పచిరిగే నా
మనసు
ఈత మాను ఇల్లుకాదు—తాటిమాను తావుకాదు
కగిలినోడు మొగుడుకాడు—తగరు బంగారు
కాదు'.

నల్లగొండ జిల్లా నకిరేకల్లు ప్రాంతానికి సంబంధించిన తడిసిన పాపయ్య, సంకోజి భద్రయ్య, కొండలింగయ్య, బొడ్డువెంకులు పాడిన ఈ పాట తెలంగాణాలో అత్యంత ప్రజాదరణ పొందింది.

'చింతకిందిరో మోట వాడరా
'చింతకిందిరో మోట వాడరా
చిగురు యామంచి ఎడ్ల జోడోయి
....నిన్ను జూడరో నీళ్ళకోస్తిరా
నీళ్ళు లేవురా నీవు లేవురా
ఎక్కడా జూచిన ఎవరూ లేరోయీ
చెప్పరాని దుఃఖమొచ్చేనూ.'

అనేక ఉపమానాలను కల్గియున్న ఈ గేయంలో బావను చూడదానికి వచ్చిన మరదలు పరిస్థితి చెప్పబడింది. ప్రియుణ్ణి (బావను) చూడాలన్న నెపంతో నీటికోసం మోటబావి దగ్గరకు వచ్చిన ప్రియురాలుకు (మరదలుకు) ప్రియుడుకానీ నీళ్ళుకానీ కనిపించవు. ఏమీ కనిపించని ఆమెకు కంఠశోకం తప్ప మరేమీ మిగలదు. ఆకలిదావుల పరిస్థితుల ప్రభావాలకు ప్రతిబింబ మీగేయం.

పొలం పనుల్లో, కర్మాగారాల్లో స్త్రీ పురుష లిరువురు పనిచేస్తుంటారు ఒక్కొక్కరిది ఒక్కో రీతి కష్టం. ఎవరి పనుల్లో వారు లీనమవుతారు. ఎవరి పనుల్లో వారికి వారే సాటి ఉమ్మడి శ్రమను మరచిపోయేందుకు వీరు పాటలు పాడుకుంటారు. వీరి కన్నీళ్ళకు సంబంధించిన ఈ గేయం కూలి వాళ్ళ బ్రతుకుల్ని ప్రతిబింబిస్తుంది.

'కూడులేని మన కూలోల్లా
కష్ట జీవులూ కార్మికులంతా
పైపులు బెట్టి గొట్టాలెట్టి
కత్తెర బట్టి కత్తిరించెరా'

ఈ గేయంతో బాటు కార్మికుల కన్నీళ్ళకు సంబంధించిన ఈ గేయం కూడా పేరును సంపాదించుకుంది.

'యంత్రాలోడా నా జీవితగాడ—కూతబెట్టంగ
సైరను గొట్టం
మాసిపోయిన బట్టలు తొడిగి—పాసి పండ్లను
నీళ్ళతో కడిగి
యిరిగి పోయిన సైకిలు ఎక్కి—గిర్రు
గిర్రున జోరుగ దొక్కి
గేటు ముందుకు వస్తే లేటాని పొమ్మండు —
లేటైన స్కూటర్ను లోపలకి రమ్మండు'

సమాజంలోని అసమానతలను ఎత్తిచూపుతూ, వర్గ పోరాటాలను ప్రతిబింబిస్తూ, సమాజంలోని కుళ్ళును విశదీకరించింది. గోపీచంద్‌గారి మాటల్లో 'ఒక వర్గం కష్టపడితే ఇంకో వర్గ సుఖపడుతుందన్నట్లు' కష్టసుఖాల తారతమ్యాలు ఈ గేయాలలో స్పష్టంగా చెప్పబడ్డాయి.

ఈశ్వరాజ్ఞలేనిదే చీమయినా కుట్టదన్నట్లు దేవుళ్ళపై, దేవతలపై జానపదులకు నమ్మకం, ఎక్కువ పాపభీతియే ఈ నమ్మకాలను ఒక కారణం అనుకుంటే, సంస్కృతీ సంప్రదాయాలు ఇంకో కారణం జానపదులు వేడుకల సందర్భంగా, ఉత్సవాల సందర్భంగా తమకున్న భక్తిని స్తుతుల ద్వారా వెల్లడించుకుంటారు.

యాచకులు భక్తి ప్రబోధంగా పాటలు పాడి భిక్షాటనను కొనసాగిస్తుంటారు. వారు తమకున్న బాణీలో దేవుళ్ళను స్తుతిస్తు పాటలు పాడి జీవనాన్ని కొనసాగిస్తుంటారు. అలాంటి కోవకు చెందిదే ఈ పాట. తూర్పుగోదావరి జిల్లా నివాసి గొన్నలగడ్డ గవరమ్మ పాడిన ఈ పాట ఆంధ్రదేశమంతటా విస్తరించి వుంది.

"విష్ణు ఈశ్వర బ్రహ్మ ముగ్గురు అన్న
దమ్ములంటా!
వారి మహిమతో చేసిన నేనొక మట్టి
బొమ్మ నంట
వస్తా పదరా! పోతా పదరా; ధర్మము
తన వెంట
ఈ సాంబశివుడు నిను బిల్వ పంపెనూ
జల్దిగ రమ్మంటా!

చేతిలో బెల్లం వున్నంత సేపూ కాకి బలగ
మంటా
చేతిలో బెల్లం సరిపడిపోతే యెవరు రారు
వెంటా
ఇంటి ముందటా మేకపిల్లలూ వేల బల
గమంట
యేడ్చేరూ ఆర్చేరు గాని యెవరు రారు
వెంట.

నీళ్ళుపోసి కూర్చుండ బెట్టిరీ మాయ
బొమ్మనంట
పువ్వులు దండలు వేసినారాయా పెద్దలు
వీరంతా
నవధాన్యములు యెవరి పదార్థం ఏది
రాదు వెంటా:
చేసిన పాపము చేసిన పుణ్యం వచ్చును
తన వెంటా!

వినాయక చవితి జరుపుకునే నవరాత్రుల్లో భాగంగా ప్రతిరోజు ఉదయం "అగజానన పద్మార్కం— గజానన మహర్నిశం" అన్న స్తోత్రం విరివిగా వినబడుతుంటుంది ఈ స్తోత్రాన్ని ప్రతి శుభకార్యానికి ముందుగా వాడుతుంటారు. వినాయకున్ని వివిధ పద్ధతుల గేయాలతో భక్తులు వేడుకుంటారు. వ్యంగ్యాత్మకంగా. హాస్యరస భరితంగా ఈ గేయాలు కొనసాగుతుంటాయి పంట కోత అప్పుడు, ఇండ్లు కట్టే ఓప్పుడు గణపతయ్యకు పూజలందుతూనే వుంటాయి. అలాంటి సందర్భాలలో ఈ పాటలు ఎక్కువగా వినబడుతుంటాయి.

"శివ శివ మూర్తివి గణనాథా— శివుని
కుమారుడవు గణనాథా
కోమట్లు నిను గొలువ గణనాథా— కోటిదేవు
లందురయ్యా గణనాథా"

"గనపతయ్యా గనపతయ్యా
ఉండ్రాళ్ళు నీకు పోతురా ఓ గణపతయ్యా
మంద కొడిగ వుండ బోకురా!

గనపతయ్యా గనపతయ్యా
మనసు నిండా పూజ సేతురా ఓ గనపతయ్యా
మమ్ము ఎవుడూ మరువ బోకురా!

గనపతయ్యా గనపతయ్యా
ఊరిలోన ఊరేగించెదా ఓ గనపతయ్యా
ఊయ్యాలలో ఊపుతానురా
మమ్ము ఎపుడు మరువ బోకురా"

నిష్కల్మషమైన భక్తులుపాడుకునే పాటలకు ఉదాహరణ ఈ గేయాలు. వీరు దేవుళ్ళను తమ గేయాలద్వారా పొగడడం, డింబేయడం చేస్తుంటారు.

పుట్టుకతో విషాన్ని కల్గియున్న నాగుపాములను సైతం జానపదులు భక్తితో కొలుస్తారు ముఖ్యంగా స్త్రీలు ఈ నాగపూజను భక్తి, శ్రద్ధలతో జరుపుకుంటారు.

'పుట్టలో నాగన్న బూచినాగన్న—ఎండలో
పడుకోకు వెర్రి నాగన్న
కలవారు ఇళ్ళలో గర్వంబువారు—కాలాపి
జల్లేరు కాళ్ళదన్నేరు.'

ఈ గేయంతో బాటు బసవరాజు అప్పారావు గారి గేయం ఈ పండుగ జరుపుకునే రోజుల్లో విరివిగా వినబడుతుంటుంది.

'నీపుట్ట దరికి నా పాప లొచ్చేరు—పాపపుణ్య
ముల వాసనేలేని
బ్రహ్మ స్వరూపులౌ పసి కూనలోయి—
కోపించి బుసలు కొట్టబోకోయి
నాగుల చవితికీ నాగేంద్ర నీకు పొట్టనిండా
పాలు పోసేము తండ్రి.

చీకటిలోన నీ శిరసు తొక్కేము—కనిదీర
మమ్మల్ని కాటేయబోకు
కోప పుట్టలోని కోడె నాగన్న—పగలు
సాధించి మా ప్రాణాలు దీయకు
నాగుల చవితికి నాగేంద్ర! నీకు పొట్టనిండా
పాలు పోసేము తండ్రి.

అర్ధరాత్రివేళ అపరాత్రివేళ పాపమే యెఱు
గని పసులు తిరిగేని
ధరణికి జీవనాధారమైనట్టి—వాటిని రోషాన
కాటేయబోకు
...నాగుల చవితికి నాగేంద్ర! నీకు పొట్ట
నిండా పాలు పోసేము తండ్రి.'

పూజలు, వ్రతాలు, నోములకు సంబంధించిన పాటలు పల్లెటూళ్ళలో అధికంగా ప్రచారంలో వున్నాయి. పల్లెటూళ్ళలో జరిగే జాతరలకు విశిష్టమైన, విలక్షణమైన ప్రత్యేకత వుంటుంది. కరీంనగర్ జిల్లా వేములకొండ జాతర తెలియనివారుండరు. అక్కడికి వెళ్ళిన వారికి మొక్కిన మొక్కులు నెరవేరతాయని జానపదుల విశ్వాసం. వేములకొండకు ఒకముసలమ్మ తన మనుమన్ని తీసుకొనిపోయి మనుమని తల నీలాలు సమర్పిస్తానని మొక్కుకుంటుంది. వేములవాడ జాతరకు పోయేటప్పుడు ఎదురయ్యే సమస్యలు, మోసాలు పోయిన తరువాత ఎదురయ్యే మోసాలు ఎలా వుంటాయో ఆ ఒక వ్యక్తి ఈగేయం ఎలా ద్వారా వివరిస్తాడు.

'వద్దంటే ఏములాడ పోతాను అంటవే
పోరగాని గుండు ఆడా గీకిత్తనంటవే
పోను, రాను ఎక్కడింగా మూట ముల్లె
పయిలమే (భద్రం)
కరీంనగరు జిల్లా జెర హుషారుగుండవే
మాట పయిలమే అవే: నీ మూటా పయిలమే
అవ్వా
పొల్ల పయిలమే అవ్వా పొల్లగాడు పయిలమే
అవ్వా
పొల్లగాని గుండుమీద సుండున్నదంటినే
సుండుమీద రెండు మూడు పుండ్లున్నవంటివే
కత్తి పెట్టి గీకితే కై కై మంటదే
నాయ్యకుండ గీకితే నోరుమూసుకుంటాడే
మాట పయిలమే అవ్వా నీమూట పయిలమే
అవ్వా
పొల్ల పయిలమే అవ్వా పొల్లిగాడు పయిలమే
అవ్వా
బస్సెక్కి పెద్దచోటు కండక్టరయకిస్తే

చిట్టిమీద గీతగీసి మలచి మళ్ళ చేతికిచ్చే
దిగిపోంగా మళ్ళియాది చెయ్యదే అవ్వా
మాట మరిసిపోతే పైస మాయమే అవ్వా
॥మాట॥

గుండు గీసి గుండంలో స్నానాలు చేస్తుంటే
అడ్డబొట్టు అయ్యగాడు ఆగమాగం జేస్తాడు
గుండంలో ముంచినోన్ని మళ్ళిమళ్ళి ముంచు
తాడు
ఏములాడ రాజన్న ఆట చూస్తుంటాడు
॥మాట॥

చిల్లర పైసాలాకు గుడిమెట్లు దిగివస్తే
పక్కనున్న కుప్పదీసి ఒక్క రూపాయి
అంటదే
లెక్కపెట్టి చూస్తే మరి అటాన వుంటదే
ఏములాడ రాజన్న ఆట చూస్తుంటదే ॥మాట॥

సమాజంలో జీవించే ప్రతి ఒక్కరికి ఇంకొక్క రితో బంధాలనేకం వుంటాయి. ప్రత్యక్ష, పరోక్ష బంధాల మధ్య వెలువడే ఈ పాటల్ని స్త్రీల పాటలుగా పరిగణిస్తుంటాం. అత్త-కోడళ్ళ మధ్య బావ-మరదళ్ళ మధ్య, వదినె-మరదళ్ళ మధ్య ఇమిడియున్న జానపదుల అలవాట్లు, అభిరుచులు ఈ గేయాలలో స్పష్టమవుతాయి.

''కాశికెడదామంటే కదలవే కాళ్ళు
ఢిల్లీకెడదామంటే తిరగదే మనసు
నారాచ పుట్టింటి కెడదామంటే
నాకాళ్ళు పన్నిన్న రథములై నడచు
నా చేతులయ్యాల్చేరులై యూగు''

ఈ గేయంలో స్త్రీ మనస్తత్వంతో బాటు వారికి పుట్టింటి వారిపైగల ప్రేమాభిమానాలు కనబడుతున్నాయి. అలా అని ప్రతి స్త్రీకి అలా ఉండాలన్న నియమం లేదు. ప్రతిస్త్రీ తన జీవిత కాలమంతా సుఖంగా గడపాలన్న నియమం లేదు. 'ఆలోచించే వారికి సమస్యలుంటా యన్నట్లు' ఆడపిల్లలున్న తల్లిదండ్రులకు అనేక సమస్య లుంటాయి. ముఖ్యంగా వీరిని వెంటాడేది వరకట్న సమస్య. ఈ వరకట్నం చాలా మంది స్త్రీల జీవితాలను అర్థాంతరంగా హరించివేస్తున్నది. ఈ వరకట్నమన్నది సమాజం నుండి శాశ్వతంగా పోవాలని స్త్రీలు పురుషులు ఈ సమాజంలో సమానంగా వుండే రోజు రావాలని ఈ గేయం తెలుపుతుంది.

'కర్మభూమిలో పూసిన ఓ పువ్వా
విరిసీ విరియని ఓ చిరునవ్వా
కన్నుల ఆశలు నీరై కారగ
కట్నపు జ్వాలలో సమిధై పోయావా
... పెండ్లి కూతురుగ ముస్తాబయ్యి
స్మశానానికే కాపురమెళ్ళావా
... కారు మేఘములు కమ్మేశాయా
చీకటి చితిలో శవానివై నావా
—పిశాచ గణాల ఆనందానికి
మారణ హోమం జరుగుచున్నది
—స్త్రీలు, పురుషులు మనుషులందరు
సమాన్న మన్న సమాజ ముండాలి'

ఈ గేయం స్త్రీ జాతికి చైతన్యంగా, కామ పిశాచులకు గొడ్డలి వేటుగా, ఆదర్శ సమాజానికి ప్రతీకగా కనబడుతుంది. నీచ నికృష్ట సంప్రదాయంలో పుట్టుకొచ్చి, మూడు పువ్వులు ఆరు కాయ లుగా వర్ధిల్లుతున్న వరకట్నం ఒక్క స్త్రీ జాతి చైతన్యంతో శాశ్వతంగా సమాజం నుండి తొలగి పోదు స్త్రీ, పురుష లిరువురు భాగస్వాములై కలసి పోరాడాలన్న విషయాన్ని ఈ గేయం స్పష్టం చేస్తుంది. ఈ గేయాన్ని చదివి ప్రభావితులైన

గజ్జాల శ్రీనివాస్ వరంగల్ జిల్లా శిలాసపురం నివాసి ఒక గేయం రాశారు. ఈ గేయంలో ముఖ్యంగా విద్యార్థుల భవిష్యత్ను, విద్యార్థులకు ఎదురయ్యే సమస్యలను, సమస్యల పరిష్కార నేపథ్యంలో విద్యార్థులు నిర్వహించాల్సిన బాధ్యతలను చక్కగా వివరించారు.

''వేద భూమిలో పుట్టిన విద్యార్థి
బాధల ఒరిలో, అప్పుల ఊబిలో
చిక్కుకు పోయిన దేశం మనదోయీ
సనాతనాలు రక్షణకావు—ఆధునికాలు చేరువ
కావు
పథకాలేవి ఫలితాలివ్వవు ఊహలేవి ఊర
డించవు
పున్నమిచంద్రుని పోలినబాలా—
భవిష్యత్తంతా అంధకారమే బాధలనోర్చే
ఓరిమి నీకుందా?
...ఎండను వాడిన మల్లియమల్లే
హారం చేరక హారతినీయక—భారతమాతకు
బరువే అవుతావా?
...కల్లలు ఎల్లలు ఎరుగని నాదే
బిడియం గాలిలో పరువు గంగలో కొట్టుకు
పోతే గట్టును చేరేవా?
మొక్కగానే పడగొట్టిందంటే—మొగ్గలోనే
త్రుంచేసిందంటే
రెక్కలు రాలిన పక్షినిబోలే—ఆశయాలకు
ఆశలుటిరే
ఘోరవిపత్తుకు దారులు తీసేవా
...చిత్తశుద్ధితో పరిశ్రమించి—కొత్తబాటలో
ముందుకు సాగాలి''

ఆధునిక యాంత్రిక నాగరికత సమాజంలో వస్తున్న మార్పులు మనిషి జీవితానికి ముఖ్యంగా విద్యార్థుల జీవితానికి చెలగాటంగా తయారయ్యాయి. సనాతన సంప్రదాయ భావాలను వదులుకోలేరు. కొత్తవాటిని పూర్తిగా స్వీకరించలేరు ఈ రెండింటి మధ్య 'రెంటికి చెడిన రేవడిలా' భయంకరమైన సంఘర్షణకు లోనవుతున్నారు. కర్తవ్య దీక్షను, మానవతా, నైతికవిలువలను నేర్పాల్సిన సమాజం ఉన్న మన తత్వాలను తయారుచేస్తుంది. సమాజంలోని ప్రతి మనిషి తనకంటూ ఒక ఆలోచన దృక్పథాన్ని ఏర్పరచుకొని పురోగమన దిశకు పయనించాల్సిన అవసరాన్ని ఈ గేయం స్పష్టం చేస్తుంది.

మనిషి జీవితంలో వివాహ శుభకార్యాలు, పండుగలు, నోములు, వ్రతాలు అనాదిగా వస్తున్నాయి, పండుగల రోజైన కుటుంబసభ్యులు, ఆత్మీయులందరు కలుసుకుంటుంటారు. జరుపుకునే ఈ పండుగల సందర్భంలో వెలువడే పాటల్ని వేడుక పాట లంటుంటాం.

''పిలిపించు నీ సీత పిలుపు చూతాము
పిలుపేమి చూసేవు చిలుక పలుకుల్లా
పిలిపించు నీసీత నడకచూతాము
నడకేమి చూసేవు హంసనడకల్లా
...సీతకన్న నిన్నాడే అయోధ్యరాముడు

పెళ్ళి సంబరాలలో వినబడే ఈ పాట పేరు ప్రఖ్యాతులందుకుంది.
ఈ సంబరాలలో పెళ్ళికూతురును సీత అనడం, పెళ్ళి కుమారుని చూసేటపుడు సీత సిగ్గుపడడం ఇలాంటి సన్నివేశంలో అమ్మలక్కలు సరదా పట్టించడం మనం చూస్తుంటాం. పెండ్లి పిల్లను తోటి ముత్తయిదువలు గేలి సేయు పాటలు, పానుపు సంబరాలలో పెండ్లి కూతురును జాగ్రత్తగా మసలుకొమ్మని తోటివారు గేలిసేయుపాటలనేకం వున్నాయి.

'చుక్కల్లో చంద్రుడమ్మ మా పెండ్లికొడుకూ
చుప్పనాతి దాశవమ్మ పెండ్లి కూతుర
అన్నదమ్ములు గలవాడు మా పెండ్లి కొడుకూ
భావించి తిరుగమ్మ పెండ్లి కూతురు'

ఈ గేయంలో పెండ్లి కుమారున్ని సూటి, పోటి మాటలతో దెప్పి పొడుస్తుంటారు. అంతే కాకుండా ఈ సంబరాలలో వదినా, మరదళ్ళను, బావ–మరదళ్ళను, వియ్యపువారిని తమ దైన మాటల్లో హేళన చేస్తుంటారు. పరిహాసంతో కూడు కున్న ఈ పాట హాస్య రసభరితంగా వుంటుంది.

'వియ్యల వారింట్లో విందూ చేసిరంటా
దండిగా ప్రాణాలు మెండుగానే లేవు
మట్టి కందిపప్పు వడ్డించి వెళ్ళేరు
ములక్కాయ యిగురు ముడబియ్యపన్నాము
పచ్చి తామరాకు బంతులు వేశారు
వడిగా జారు వడ్డించి వెళ్ళారు
పుచ్చిపోయిన చెక్క వాడి పోయిన ఆకు
పొట్లి పోయిన సున్నం ఇచ్చిపోయారు
బావగారి జుట్టుకూ బంతిపూలు జుట్టేరు
వీధి వీధుల దిప్పి వింతగా జూచేరు.'

సంతోషంలో విషాదమున్నట్లు పెళ్ళి జరిగే సమయంలో సంతోషం వున్నప్పటికీ పెళ్ళి కూతురుని అప్పగించేటప్పుడు కన్నింటివారితో బాటు ఇరుగు పొరుగువారు శోక సముద్రంలో మునిగి పోతారు కొన్ని సంవత్సరాల వరకు తల్లిదండ్రుల దగ్గరుండి వెళ్ళాలంటే ఎవరికైనా బాధకరమైన సన్నివేశమే 'చీకటి వెలుగుల' జీవితంలో ఇలాంటివి తప్పవు కఠినాత్ములు సైతం కన్నీరు పెట్టే ఈ గేయం మానవుల హృదయాలను ద్రవింపచేస్తుంది.

"అత్తమామలుగాని, ఆడబిడ్డలుగాని
లేరమ్మ నీ దెంత పున్నెమోగాని
మగడు ఒక్కడు గాన మనసుకెక్కియనట్లు
మర్దించి నీ వశము చేసుకోవమ్మ'

భారతదేశంలో జాతి, మత, వర్ణ, విచక్షణ లేకుండా అందరూ కలసి సంతోషంగా జరుపుకునే పండుగ హోళీపండగ. 'హోలి హోలీల రంగ హోళి–చెమ్మక్రేళిల హోళి" అన్న పల్లవి దేశమంతటా వ్యాపించి వుంది. ఈ పండుగ జరుపుకునే రెండు మూడు రోజుల ముందు యాచకులు ఇంటింటికి తిరిగి జాజిరి పాటలు పాడుతుంటారు. ఈ జాజిరి పాటలు భిన్న భాషల్లో, భిన్న ప్రాంతాల్లో వున్నప్పటికీ భావం, వర్ణనం ఒకే విధంగా వుంటుంది.

'జాజిరి, జాజిరి, జాజిరిపాట–సాపసుట్టపురా
సవ్వరికోట
కోటకోటకీ కొమ్మ లెల్లె–కొమ్మల్ తగ్గట్టు
బిద్దాలెల్లె
బిద్దాల్ తీసుకొని బళ్ళెకు పొతే–బళ్ళె తుక్క
–లన్నె బౌబౌమనె
అప్పుడే నా పాణం జల్లుమనె–జల్లుమన్న
కాద మల్లెలు లేవు
మల్లెలు, మల్లెలు తోట్లున్న-తోట్లున్న దుబ్బలు
దుబ్బలపసుపు దబ్బలకైక-రైక కాదురా
రావని మొగ్గ
మొగ్గ కాదురా మొతుకుసీద–సీద కాదురా
నిమ్మలబాయి
బాయి కాదురా బసంత కూర"కూర గాదురా
గుమ్మడిపండు
పండు కాదురా పావయ్య మీసం–మీసం
కాదురా మద్దాల కట్ట

కట్ట కాదురా కావని మొగ్గ—మొగ్గ కాదురా
మొతుకు సీద
సీద కాదురా నిమ్మల బాయి.'
'రయోర రయో రయ్యింత—రయ్యిని పేరు
ముతంతా
మూత తీసుకుపోయి మూలకు బెడితే
నక్క ఎత్తుక పాయెరా-నారాయణ
నారాయణని నాలకుపోతే-గొంగడి పాయెరా
గోవింద
గోవింద అని గోడ కొరిగితే పెల్లకూలెరా
పెర్మన్న
పెర్మన్న అని పెండకు పోతే—ఆవు తన్నెరా
హమ్మన్న
హర్మన్న అని అంగడి పోతే—గొంగడి
పాయె గోపిందా.

ఈ పాటలు ఎక్కువగా తెలంగాణ జిల్లాల్లో ఆదరణ పొందాయి. ఆంధ్రలో కూడ ఇలాంటి పాటలున్నాయి ఈ జాజిరి పాటల్లో కులవృత్తులను ఇముడ్చడం అనుకున్నంత తేలిక కాదు. బురదలో పడుకొన్న దున్నపోతును ఎందుకు పడుకున్నావ్ అన్న మాటలతో ప్రారంభమైన ఈ గేయం కులవృత్తుల వారిని జోడిస్తూ పోయికాడ గొట్టె మూడే—ముసలమ్మ చావురానిది నేనేమి చేయాలి? అన్న ప్రశ్నతో ముగుస్తుంది. ఈ గేయంలో కులవృత్తుల వారి పనులు అత్యంత రమణీయంగా, హాస్యరస భరితంగా చెప్పబడ్డాయి. తెలంగాణా జిల్లాల్లో ప్రచారాన్ని పొందిన జాజిరి పాటలవారాను వర్ణనానికి ఈ గేయం ఏ మాత్రం తీసిపోదు,

'దున్న పొద్దున్న పో దుక్క లెందుకు బన్నవ్
పసులోడు గాయంది నన్నేమంటవ్
ఏమిర పసులోడ ఎందు గ్గాయవ్
జీతమియ్యంది నన్నేమంటవ్
పటేల పటేల జీతమెందు కియవ్
సోల దొరుకంది నన్నేమంటవ్
ఏయే సోల ఎందుకు దొరుకవ్
వడ్డోడు చెక్కంది నన్నే మంటవ్
ఏమిర వడ్డోడ ఎందుకు చెక్కవ్
బాడిశె తెగంది నన్నే మంటవ్
ఏయే బాడిశె ఎందుకు తెగవ్
కమ్మరోడు చరువంది నన్నే మంటవ్
ఏమిర కమ్మరోడ ఎందుకు చరువవ్
తిత్తూదంది నన్నే మంటవ్
ఏయే తిత్తి ఎందుకు ఊదవ్
బక్కడి చావంది నన్నే మంటవ్
ఏమే బక్కదాన ఎందుకు చావవ్
ఆయుసు మూడంది నన్నే మంటవ్.'

ఈ జాజర పాటలు ముఖ్యంగా హోళిపండుగ జరుపుకునే సందర్భాల్లో వినబడితే, కోలాటంపాటలు ముఖ్యంగా దసరా, దీపావళి, ఉగాది, సంక్రాంతి, వినాయకచవితి మొదలైన పండుగల సందర్భాలలో వినబడుతుంటాయి. పెద్దచిన్న తారతమ్యం లేకుండా అందరు కలసి ఈ కోలాటం పాటలు పాడుతుంటారు. కోలలు ఏసుకుంటూ, వాటి కనుగుణంగా అభినయంచేస్తూ ప్రేక్షకులను రంజింపచేస్తారు. వీరు 'కోలుకోలన్న—కోలో నా సామి' అన్న పల్లవిని భిన్నరకాలుగా ప్రయోగించి భిన్నరకాలశైలుల్లో ఈపాటలు పాడుతుంటారు.

1 "కోలుకోలన్న కోలుకోలో నా సామి
కొమ్మలిద్దరు మంచిజోడూ
ఆ రాజా నన్నూ బిల్వదమ్మా నాసామి
రాజగోపాలుడే కొమ్మా
ఇంతలింతల సీరగట్టి నాసామి
ఈత పెళ్ళా రయిక దొడిగి"
2. కోలూ కోలే కోలన్నా కోలే
యా...కోలూ కోలే శైలియా మేలుకోలన్నా
నిన్న నేడూ నాతో పొందుజెత్తూ
నానే రాములూ మెంచ సీతా రీతి నాడూ

బామా మంచిది—బంగారు గూళ్ళదీ
నేనేమి జేతురా తమ్ముడ—అది కానీ కులమూదీ

3. కోలూకోలన్న కోలూకోలే...కోలూ
కోలూ కోలనా కోలూ కోలే
కోలూనా కోలనా కోలూ కోలే ఏకా బలమూ
కొమ్మాలిద్దరూ మంచి జోడే
వానేడ గురిసేరా జానా మటము
యెంకటగిరి సవికెలోనా.

4. కోలూ కోలే అ...కోలూ కోలే
అ, కోలూ కోలే శెలియా
మేలూ కోలన్న సై సై
నిన్నానెన్నడు నాతో పొందూగూడి

5. కోలుకోలన్న కోలు కోలే నా సామి
కొమ్మలిద్దరు మంచిజోడే
రాజు నన్నా బిల్వడమ్మా
మరికాన రాజు గోపాలుడే కొమ్మా
ఓ....యేటి వొడ్డున యేపిసెట్టూ నా సామీ
ఏ పూరేగీ పూత బూసే
పూతదిన్నా బోతు పెయ్యా నా సామి
కోడెలేకా గొడ్డుబోయా
ఊరియేనకా వుడత జచ్చే నా సామి
ఉంచుకున్న లంజె జచ్చె
దాగికొక్కా తమ్ముడుంటే నా సామి
సూడబోయీ వాడు జచ్చె
రాజసం నే దంచబోతే నా సామి
శందనం సెయి జారిపోయే
గొప్పరాజుల శంద్రుడమ్మా నా సామి
ప్రేమ గల్లా దేముడమ్మా'

ఇలాంటివి అనేకం వేడుకపాటలు ఆంధ్రదేశమంతటా విస్తరించి వున్నాయి. విస్తృత పరిధిని కల్గియున్న ఈ జానపద గేయాల పేరు వినగానే చాలా మందికి ముందు స్ఫురించేది శృంగార గేయాలే. దక్షిణ భారత దేశంలో ఈ గేయాలకు ప్రత్యేక స్థానముంది. ఈ గేయాలలో ప్రియుని మనసు—ప్రియురాలి మనసు ప్రధానపాత్ర వహిస్తాయి. ప్రియురాలంటే—ప్రియుడికి, ప్రియుడంటే-ప్రియురాలికి (నిజమైన ప్రేమికులకు) ఎనలేని ప్రేమాభిమానాలంటాయి. 'భార్య భర్తల మధ్య తగాదా అద్దం మీద ఆవగింజలాంటి దన్నట్లు' ప్రేమికుల మధ్య ఎడమొహం—పెడమొహం కూడ అలాంటిదే.

'తాగి చెట్టెక్కి రాగాలు తీస్తాడు—రోగమన్న వచ్చి సావదేమే,
వీడి రాగాల మీద మన్నుపోయా
వొట్టి చాపల కూర వొడిపిళ్ళ మెతుకూలు—
వొచ్చైనా బుక్కేడు తినదేమే
వీడి వొక్కిరి మొఖం మీద మన్ను పోయా
సుద్దాల బాయికాడ సద్దసేనేఱుంగ—సూసైనా సైగ చేయదేమే
వీడిసోది మొఖం మీద మన్నుపోయా
కోటవ్వ తిరునాళ్ళ కోలాట మాడంగ—జీర కొంగైనా పట్టిగుంజదేమే
వీడి కోతి మొఖం మీద మన్నుపోయా
వలగొండ మా వూరు—హోళి వండగబోతే—
గుప్పుగుప్పున రంగు గుప్పదేమే
వీడి గూని మొఖం మీద మన్నుపోయా
కల్లు, సారా తెచ్చి కల్లంలోనే బెడితే—కాకి వోలే వచ్చి తాగదేమే
వీడి కక్రిమొఖం మీద మన్నుపోయా'

నల్లగొండ జిల్లా చిట్యాల ప్రాంతంలో అధిక ప్రచారంలో వున్న ఈ గేయంలో ప్రేమికు లిరువు

రికి ఒక్కరంటే ఒకరికి ప్రేమాభిమానాలుంటాయి. ఒకరిని విడిచి ఇంకొకరు వుండలేరు. పైగా మేనరికపు జంట వారిది, బావతో కలిసి సరసాలు చేయాలని మరదలు కలలు కంటుంది, అందువల్లనే బావను సూటి, పోటి, మాటలతో గేలి చేస్తుంటుంది. అలాగైనా బావ తన వలలో చిక్కుకుని సరదాలు చేస్తాడని అనుకుంటుంది. బావ మరదళ్ళకు సంబంధించిన ఈ గేయం ప్రేమికుల మధ్య వున్న నిష్కల్మష ప్రేమను వ్యక్తం చేస్తుంది.

'యెందు కలిగి నావురా రారా నా సామీ
యెందు కలిగినావో యెందు కంటిరా
నిన్నూ
ముందు జేసిన బాసా లేదు బోయెనులా
పచ్చి కొబ్బరి వాలె పాయమున్నది సామీ
పాయ మెవ్వరి పాలు జేతూర జాణా
చెరకు తుంటల వాలె చేతూలున్నవి సామీ
చేతులెవ్వరి మీధా యేతూర జాణా!
అరటి బొందెలు వాలె తొడలు వున్నవి సామీ
తొడలు యెవ్వరి మీదా యేతూర జాణా!
నిమ్మపండుల వాలె రొమ్మూలున్నవీ సామీ
రొమ్మూ లెవ్వరి చేతి కిత్తూర జాణా!

కర్నూలు జిల్లా పత్తికొండ మండలానికి సంబంధించిన ఈ గేయం అలిగిన భర్తపై భార్య ఆవేదనను తెలియచేస్తుంది. నా శరీరంలోని ప్రతి అణువణువు నీదైనపుడు నాపై కోపమెందుకని తన మాటల ద్వారా వ్యక్తం చేస్తుంది.

'రారా నా యింటికి ఒంటిగ నిదుర రాదు
నా కంటికి
బోటి మీద వాది యిల్లూ–బొంగురాల బోలు
తలుపు
తమ్మల పాకుల ద్వార బంధం
వంగి రారా వన్నె కాదా–చెంగు తగిలి
చిన్నబోయేవు
చక్కనినీరి సాపలోన–ఒక్కదాన్నే వున్నారో
రారా
వద్ద వన్నోడి నా కుంట-వద్ది మాను కదం
కుంట
గాజుల గల్లు మనకుంట–గంధం పేడెత్త
కుంట
పొట్టిదాన్నను కున్నవేమొ–పొందదేమొ
నీదు మనసు
పొట్టి దాన్ని గట్టితనము–పట్టె మంచం
ఎక్కిచూడు
నల్లరేగడి దున్ని చూడు– తెల్లజొన్నలు
పండవేము'

స్త్రీ పాడిన పాటగా ఈ గేయం కనబడినప్పటికీ దీనిని పాడింది, నల్లగొండ జిల్లా నకిరేకల్లు మండలానికి సంబంధించిన తడిసిన పాపయ్య, సంకోజి భద్రయ్య, కొండ లింగయ్య, బొడ్డు వెంకులు. సెరజాణ తన విటునకు తన ఇంటి ఆనవాలును, తన చెంతకు చేరాల్సిన విధానాన్ని చెపుతూ, తన వ్యక్తిత్వాన్ని సైతం నిర్మొహమాటంగా బయట పెట్టుకుంటుంది.

ఈ శృంగార గేయాలతో ప్రేమతో కూడుకున్న తమాషా వినోదాలు అనేకం వుంటాయి. ఈ గేయాలలో కోటిగాడు-చిట్టెమ్మ, ఎంకన్న–చంద్రమ్మ, నాయుడమ్మ–నాయుడుబావ అన్న పేర్లు జానపదులు వాడుతుంటారు. ఈ గేయాలలో హాస్యం వున్నప్పటికీ ఇవి హాస్యరస గేయాలని పించుకోవు. ఈ గేయాలలో ప్రధానంగా హాస్యం పోషించబడుతుంది. 'ఆలోచించే–మనిషికి జీవితం హాస్యరూపకం, స్పందించే మనిషికి జీవితం విషాద రూపకమన్న' హోరేశ్‌వాల్‌పోల్ మాటలు గేయాలకు అద్దంలో ప్రతిబింబంలా సరిపోతాయి "వికృతాంకార వాగ్వేష చేష్టాదుల వల్ల హాస్యం పుడుతుందని. నిర్వచించిన ఆలంకారికుల అభిప్రా

యాలు భారతీయ సన్నివేశానికి కాకుండ పాశ్చాత్య సన్నివేశానికికూడ సరిపోతాయి.

'నవ్వడంగాని, నవ్వించడంగాని భగవంతుడిచ్చిన వరంలాంటిదన్న అభిప్రాయం అంతటా విస్తరించి వుంది. నవ్వును దృష్టిలో పెట్టుకొని ఈ గేయా లుద్భవించవు. గేయాలలోనే హాస్యం పుట్టుకొస్తుంది. నవ్వును పుట్టించే సమయ సందర్భాలే ఈ గేయాల పుట్టుకకు ముఖ్యకారణ మవుతవి.

'పోతుంది సూడరా కలింటికీ–లంజె తాగినంకా రాదు మాయింటికింపోతుంది సూడరా జీతగానివోలె–కాసుసేతికిచ్చి కబోల్లు మ మంటాది సుట్టాలు వచ్చిన్రు మా యింటికి-కల్లు బాగుంటే రేపొత్త మీయింటికింసల్లదాగిన వారికి నాటికి–కల్లు సంగతే మెరకమ్మ లోకానికి కల్లైతే తాగింది కళ్లెల్ల బెట్టింది–పళ్లిగిలబెట్టింది-బడబడా గక్కింది ఇకపోను కట్లకి యేనాటికీ–ఎంతవని యాయనే దెయ్యానికి అది నీంతిలే చేసింది పానానికి–యికపోను కల్లుకి యేనాటికీ యానిబుద్దులే జెప్పింది పానానికి–ఎవరన్న జూచితే యేమనుకుంటరని బట్టదులుపుకొని బాటబడి వస్తుంది'

నెమిలి రామలింగారెడ్డి పాడిన ఈ గేయంలో మోటు హాస్యం షింపపోషిపబడింది. పురుషపాత్రకు ఇంత ప్రాధాన్యత చేకూరేది కాదు. తాగే విషయంలో తన అంతస్తును మరచి డబ్బులు కల్లువానికి ఇచ్చి కల్లుబొయ్య మంటుంది. అలా అని ఊరుకోక కల్లుబాగుంటేఉరేపొస్తానచిచెపుతుంది.మంచి కల్లుతాగడానికి నిర్మొహమాటంగా పథకంవేస్తుంది. దురదృష్టవశాత్తు తాగిన కల్లుతో కక్కడం ప్రారంభమౌతుంది ఆ తరువాయే ఇకముందు కల్లు తాగనని ప్రతిజ్ఞ చేస్తుంది. ఎవరన్న చూస్తారని అటు ఇటు గమనించి తూలుకుంటూ ఇంటిదోవ వస్తుంది. ఈ గేయం స్త్రీని ఉద్దేశించడంవల్లనే నవ్వవస్తుంది. పురుషపాత్రలో ఇది సాధ్యంకాదు.

''ముసలాడు మాతాత పనినిక్కపండు
పడుచు దానిని పెండ్లాడి పై కాపులుండే
నవ్వుతూ అయ్యమ్మ నంపి పూజించి
....ఆషళ్ళు తిన్నారు పాటపాడేరు
... పుణ్యవంతుడి తోట కానీ వొరగాలి
....పుణ్యవంతుడి చెరువు పొంగిపొర్లాలి''

ఒక ముసలివాడు పడుచు పెండ్లాం కొరకు పడిన బాధలు, ఆమె వచ్చాక వుండాల్సిన సౌకర్యాలను ఏర్పరచడం ఇవన్నింటిని చూసి ఊరి ప్రజలు పాడిన పాటయిది పల్లెటూరి హాస్యానికి ప్రతిబింబంగా ఈ గేయం కనబడుతుంది.

వివాహ శుభకార్య సమయంలో ఒకరినొకరు తమాషా పట్టిస్తుంటారు పెండ్లి కుమారునితో పేరంటాండ్రు మాట్లాడే మాటలు అతన్ని తంపెత్తకుండా చేశాయి అలాంటి సందర్భంలోనిదే ఈ గేయం.

''నిన్న మొన్న విస్తళ్ళు నెట్టుకొడ్డాయి
నీతి మాలిన పెండ్లికొడక లేచిరావయ్య
మొన్నదిన్న విస్తళ్ళు మోపులడ్డాయి
మొండి పెళ్ళికొడక లెచిరావయ్య
ఏనుగులు లేవని యేలడిగినారు
యెల్ల గాడిదనెక్కి లెచిరావయ్య
గుర్రాలు లేవని యేలడిగినారు
గుడ్డి కుక్కనెక్కి లేచిరావయ్య
పల్లకీలు లేవని ఏలడిగినారు
పందికొక్కు నెక్కి లేచిరావయ్య
మేనాలు లేవని యేలడిగినారు
మేకపోతూ నెక్కి లచి రావయ్య''

తెలంగాణా ప్రాంతంలో ఎక్కువ కాలంమంది కష్టపడితేగాని తిండి దొరకదు ముఖ్యంగా భార్య

భర్తలిరువురు దినసరివేతనానికి పోతుంటారు. ఇరువురు కష్టపడినప్పటికీ కుటుంబం గడవని కుటుంబాలనేకం వున్నాయి. ''దారిద్ర్యానికి ఆకలి ఎక్కువన్నట్లు'' అతనికి విపరీతమైన కోరికలుంటాయి. అతడి కోరికలను తీర్చడానికి ఆమె పడే పాట్లను ఈ గేయం వెల్లడిస్తుంది. ఎన్నిపాట్లు పడినా తిరస్కారభావమే ఆమెకు శరణ్యమవుతుంది. అతని గొడవను అమ్మలక్కలకు పాటగా పాడి వినిపిస్తున్న వైనమిది. ఈ పాట వరంగల్ జిల్లాలో ప్రాచుర్యాన్ని పొందింది.

'సూరుసూరు తిరిగి సుట్టాకు నేదెస్తే—పొవ్వాక
లేదని పొడువాస్తడక్కా పొడువాస్తడక్కా
వాన్ని నేనేమన్ననా—వానయ్య సొమ్మేమన్న
దిన్ననా ?
గడపగడప దిగిరి తండపప్పు దెస్తే—వండికొ
క్కులాగ పైకొస్తడక్కా పైకొస్తడక్కా
వాన్ని నేనేమన్ననా—వానయ్య సొమ్మేమన్న
దిన్ననా ?
పట్నంకు నే బోయి పంచ గొనుక్కొస్తే-
పాత పంచని పంచాయతి బెట్టె పంచాయతి
బెట్టె
వాన్ని నేనే మన్ననా—వానబ్బ సొమ్మే
మన్న దిన్ననా ?'

జానపదులు శృంగార, హాస్య గేయాలతో బాటు కన్నీటి పాటలను—కూడ పాడుకుంటారు. అనుకోకుండా సంభవించే దుర్ఘటనలు, హృదయ విదారక-సన్నివేశాలు, ప్రముఖుల సహజ మరణాలు సకాల మరణాలు కరుణరసావిర్భావానికి మూలాధారాలు. ప్రకృతివైపరీత్యాలయిన వరదలు, తుఫానులు, అగ్ని ప్రమాదాలు, పడవ ప్రమాదాలు, కలరా, మశూచి మొదలైన అంటువ్యాధుల వల్ల జరిగే మరణాలు, జాతీయనాయకుల హత్యలు, ప్రాణత్యాగాలు ఇతర ప్రమాదాల వల్ల జరిగిన అకాల, సకాల, సహజ మరణాలు జానపదులు కన్నులారా చూడడంగాని, చెవులారా వినడంగాని జరుగుతుంది. ఆ సంఘటనల్ని వర్ణిస్తూ ప్రజల హృదయవేదనను తెలిపే-పాటలే కన్నీటి పాటలు.

ఈ కన్నీటి పాటలు ఒక్క ఆంధ్రదేశంలో కాకుండా దేశమంతటా విస్తరించి వున్నాయి. ఈ పాటలు వింటున్న ప్రతి ఒక్కరు తన జీవితంలో ఏదో కోల్పోయానని అనుకుంటాడు. భార్యాభర్తల మధ్య వియోగం, తండ్రీ కొడుకుల మధ్య వియోగం, సోదరుల మధ్య వియోగం, ప్రాణస్నేహితుల మధ్య వియోగం భరించరాని సన్నివేశా—సంఘటనలే. ఒక కంచంలో తిని, ఒకే మంచంలో పడుకునే దంపతులలో వియోగం సంభవిస్తే ఆ విషాదం ఎలా వుంటుందో చెప్ప నలవికాదు. భార్య వియోగం తరువాత భర్త విషాదం ఎలా వుంటుందో ఈ గేయం తెలుపుతుంది.

'సుద్దబొందలకాడ—నీ సుద్ది దియ్యంగానె
సద్ది దిన్నట్టాయనే సిలకా—సిన్నారి సిలకా
ఇంతెల్ల మెదబాపెనే సిలకా—ఎంత పాపపు
దేవుడే సిలకా
సమర్తయై నీవు సాటుకు కూకుంటే—సత్తె
బామా మందురే సిలకా
— సిన్నారి సిలకా
పసిడ్డై నువ్వొక్క పందిట్ల గూసుంటే
పార్వతీ దేవందురే సిలకా —సిన్నారి సిలకా
ముత్తైదవై నీవు మూలకు గూకుంటే
మద్దబంతి వందురే సిలకా — సిన్నారిసిలకా
ఇద్దరము తినేటి ఆ బొద్దు గిన్నెలా
ఒక్కనికి ఒనరాయెనే సిలకా—సిన్నారిసిలకా
ఇద్దరము కప్పేటి మద్దికాయల దుప్పటి
ఒక్కనికి ఒనరాయెనే సిలకా—సిన్నారిసిలకా'

చనిపోయిన తల్లిని దలచుకొని దుఃఖించు చున్న తోబుట్టువును సోదరు డోదార్చు ఈ పాట ఎదుటివారి హృదయాలను ద్రవింపచేస్తుంది

'దచ్చనదారిలో దవ్వన్నదారిలో—ఇయ్యాల
మా తల్లి సచ్చిపోయింది
ఏమి చేస్తము చెల్లె దేవుడింత రాసె—
ఏడ్వాకు ఓ చెల్లె యెడ్డిరో నీవు
పాపకారి యముడూ పానము దీసె—దేవుని
మహిమలు తెలుసుకోలేము
తొమ్మిది నెల్లు మనల తెగబాచి వుంచె—
యాది మరువగలేను అవ్వ మాయన్న
యాది వుంటే మనమేమి చేసే వారము—
పాలు బువ్వా బెట్టి పరగంగా బెంచె
యాది మరువగలేను అన్న మా యన్న —
కైలాస శంభుణ్ణి కరుణించుకుందాం
కలియుగ దావరము కరుణించువాడు.'

మానవుడిని ఒక సంపూర్ణ వ్యక్తిగా, సర్వ లక్షణశోభితునిగా—భగవంతుడు సృష్టించాడన్న వాదాన్ని ప్రపంచంలోని కొంత మంది నమ్ము తారు: మరికొందరు తమ అనుభవాలను ఆలంబన మైన ప్రకృతిని పరమార్థంగా నమ్ముతారు. పరి మితుల స్వరూప, స్వభావాలు, వాటికాధారమైన నమ్మకాలు, అపనమ్మకాలు వాటికి మూలమైన భగవంతుని గురించి తెలుసుకోవలెనన్న తపనతో శారీరక, మానసిక ప్రాపంచిక అవధుల నధిగ మించి సర్వసృష్టిని ఏకంగా భావించుకొని దానికి మూల కారణాన్ని అన్వేషించటంలో తత్త్వం ప్రారంభమైంది. ఈ తత్త్వానికి సంబంధించిన గేయాలను తాత్త్విక గేయాలంటారు. యాగంటి లక్ష్మయ్యగారి, ఎడ్లరామదాసుగారి, చిలకపాటి వారి, పిడుపర్తివారి తత్త్వాలే కాకుండా బ్రహ్మం గారి 'కాలజ్ఞాన తత్త్వాలు' కూడ ఈ గేయాలకు వర్తిస్తాయి.

''శాచలంబగు జగతిలోపల—శాశ్వతంబొక
టేదిరా
కన్ను మూసీ తెరిసినంతలో—కలిమిలేముల
మాయరా!
తల్లిదండ్రీ ఆస్తిపాస్తులు—అన్నదమ్ములు
యిక్కడా
పరమభక్త మునీంద్రులెల్లా— పసందులు
సేయుదురక్కడా
ఇల్లువాకిలి అన్నదమ్ములు—యిచ్చి వుచ్చే
దిక్కడా
యెల్లిపోయేనాడు యెవరు—యెంటరారు అక్కడ"
బంకవట్టి యిల్లుగాయిది—అగ్గిబుగ్గైపోవురా
నీది. నాది అనుచు నరుడా—వాదులాడబోకురా
గురువునని మెదనింద దండలు—గురుతులేసే
దిక్కడ
పరమభక్తి మునీంద్రులెల్ల—పసందుసేయుదు
రక్కడ

అశాశ్వతమైన జీవితంకోసం మానవునిలో ఈ సంకుచిత భావాలెందుకు? తలిదండ్రులు సంపా దించిన ఆస్తికోసం నీచంగా దిగజారే మనం చని పోయాక తీసుకెళ్ళేదేమిటి? ప్రజలు తమ స్వార్థం కోసం సంకుచిత భావాలను పెంచుకుంటూ పోతే భక్తిని జీవితధ్యేయంగా భావించి ఆదర్శ సమాజం కోసం, మానవీయ మనుగడ పరిరక్షణకోసం మునులు ఎందుకు తపస్సు చేయాలి? ఇలాంటి అనేకాంశాలు ఈ గేయంలో చోటుచేసుకున్నాయి.

కాలజ్ఞాన తాత్త్వికునిగా వీరబ్రహ్మంగారిని అందరు గుర్తిస్తారు. ఈయన దేశిరచనలు కోకొల్ల లుగా వున్నాయి. దీనికితోడు జానపదులు అనేకం

కల్పించి ఆయనకు అంటగట్టారు. వీరి కాలజ్ఞాన తత్త్వంలో హాస్యం కూడ చోటుచేసుకుంటుంది. వీరి కాలజ్ఞానానికి సంబంధించిన ఈ గేయం ఆంధ్ర దేశమంతటా ప్రచారంలో వుంది.

''నందామయా గురుడ నందామయా!
ఆనందదేవికీ నందామయా!
వీరబ్రహ్మంగారు వీధెమ్మటొస్తారు
వీధీధి కిద్దరిని కంటారయా!

ముత్యాలమ్మ గుడికాడ మూల స్తంభముకాడ
ముండలకు పెళ్ళిళ్ళు అవుతాయయా

తాడిచెట్టుమీద తాబేలు కూయంగ
తాడియెత్తూ గంగ పొంగేనయా

రాముచెట్టూమీద రాజంస కూస్తాది
రాజులకు రణయుద్ధ మొస్తాదయ్యా

వరికూడు తింటారు వరుసలూ మార్చేరు
పెనిమిటిని పేరెట్టి పిలిచేరయా

దోసకాయలు తినే పాసిముండలకల్ల
యవనంబు బురబురా వాడేనయా

ఎన్ని జెప్పిన గాని ఎన్ని చేసిన గాని
బ్రహ్మం చెప్పిన దంతా తప్పదయ్యా'

ప్రతి మనిషి తన జీవితంలో డబ్బులతో కాని మరే దానితో కాని కొనుక్కోవిది ప్రేమ. భిన్న రకాలుగా వున్న ఈ ప్రేమ మనిషికి సహజసిద్ధంగా పుట్టుకతో రావాలి తప్ప నటనతో వచ్చేది కాదు. బసవరాజు అప్పారావుగారి ఈ గేయం 'ప్రేమ' యొక్క తత్త్వాన్ని తెలుపుతుంది.

'ప్రేమ కన్నను యెక్కు వేముందిరా యెల్ల
కామ్య పదవులకన్న ప్రేమ యెక్కువరా
ప్రేమించు సుఖముకై ప్రేమించు ముక్తికై
ప్రేమించు ప్రేమకై యేమింక వలయురా.'

ఈ గేయాలే కాకుండా అద్భుత రసగేయాలు వీరరస గేయాలు, దేశభక్తి గేయాలు, అభ్యుదయ గేయాలు, ఉద్యమగేయాలు, విప్లవగేయాలు, సమకాలీన సమాజాన్ని ప్రతిబింబించే గేయాలు అనేకం వున్నాయి. ఈ గేయాలను సామాజిక దృష్టితో బాటు అనేక కోణాలలో పరిశీలించాల్సిన అవసరముంది. ఈ గేయాలన్నింటిపై విస్తృతమైన పరిధిలో పరిశోధనలు జరగాల్సిన అవసరముంది.

# అన్నమయ్య సంకీర్తనల్లో తాత్త్విక గేయాలు

వి. వెంకటరమణ

పురుషార్థములు నాలుగు. ధర్మార్థకామ మోక్షములు అని, ఇందులో నాల్గవదైన మోక్ష సాధనకు రెండు కర్మలు అవసరము ఒకటి భక్తి, రెండవది జ్ఞానము, కాని మొదటిదైన భక్తికంటే జ్ఞానకర్మ సాధించటం చాలాకష్టం. మోక్షము కోరువారికి భక్తి సులభమైన సాధనము. ఈభక్తి నవవిధములు. అవి

'శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాద
సేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మ
నివేదనం
ఇతి పుంసార్పితా విష్ణు భక్తి శ్చేన్నవలక్షణా
క్రియతే భగవత్యద్దానం తన్మన్యేధీత
ముత్తమమ్'
(భాగవతము 7 స్కం-శిఅ,23,24 శ్లో)

అను శ్లోక రూపముగా భాగవతాదుల్లో చెప్ప బడినది.

## భక్తి లక్షణము:—

లౌకిక ప్రపంచ విషయములు త్యజించి, ఆ పరమాత్మ యందే తన్మయభావము పొందుటయే భక్తి లక్షణము ఈ భక్తి సాహిత్య రూపమున వెల్లడైనది.

## ఇక రెండవది జ్ఞానం:—

జ్ఞానమనగా సంపూర్ణమైన, ఆధ్యాత్మికానుభవము. అందుచేతనే భగవద్గీతలో

'ద్రవ్యమయమైన యజ్ఞముకంటే జ్ఞాన యజ్ఞము శ్రేష్ఠమైనది ఏలయన సకల కర్మలు జ్ఞానమునందు పరిసమాప్తములగుచున్నవి:' అను భావమును తెలియజేయబడినది.

అట్టి జ్ఞానమును తత్త్వవేత్తలైన జ్ఞానులు, భక్తితో కూడిన సంస్కారముచేత, ఉచితమైన ప్రేమ చేతను, శుశ్రూష చేతను, ఉపదేశింతురని భగవద్గీత.

శ్లో॥ తద్విద్ధి ప్రణి పాతేన
పరిప్రశ్నేన సేవయా।
ఉపదేశ్యన్ని తేజ్ఞానం
జ్ఞానిన స్తత్త్వదర్శినః॥

అని పేర్కొన్నది.

పి అండ్ టి కాలనీ, దిల్‌సుక్ నగర్, హైదరాబాదు-500 680,

కావున జ్ఞానముతో సమానమైన పవిత్రమైన వస్తువు ఈ లోకములో ఏదియూ లేదు. అట్టి జ్ఞానము కర్మయోగమునందు సిద్ధిపొందిన తర్వాత కాలక్రమమున వ్యక్తి తనకు తానే పొందగలడు

ఈ జ్ఞానమార్గాన్ని అనుసరించి శంకరాచార్యుల వంటి ప్రముఖులయిన తత్త్వ, వేదాంత జ్ఞానులు ముక్తిని పొందారు పండితులు, వేదాలను, ఉపనిషత్తులను—చాలా పవిత్రంగా భావించారు. అందువల్లనే వాటిని ఇతర భాషలలోకి అనువాదాలు చేయడానికి సాహసించలేదు. కాని వేదాలు, ఉపనిషత్తులు, మౌఖిక ప్రచారంతో కొనసాగడంవల్ల ప్రజలు అందులో ఉన్న విజ్ఞానాన్ని అర్థం చేసుకొనినారు. అప్పుడు వారు నిశ్చయముగా వారికివచ్చిన గేయములు అనేకరీతులలో పాడుకోసాగారు.

ఈ తత్త్వాలనే వైరాగ్య తత్త్వాలని కూడా అంటారు. సాధారణంగా వీటిలో జీవితం మీద విరక్తి, భవిష్యత్తు మీద నిరుత్సాహం, సంసారమంటె వెగటు, ఆత్మప్రబోధం, ఆత్మనివేదన మొదలయిన విషయములు ఉత్పన్నమవుతాయి. ఇట్టి విషయములు, తుమ్మెదా, చిలుకా, జీవ, మనసా, హంసా, కర్మమా, మొదలైన పాదాంత సంబుద్ధి పదాలతో సాగుతాయి.

## 1. తుమ్మెద పదాలు :

తుమ్మెదకు షట్పదమని పేరు. అనగా ఆరు పాదాలు కలదని అర్థము. చతుర్విధ ఫలపురుషార్థములలో మూడవదైన కామమును అరిషడ్వర్గాలలో చేరుస్తారు. తుమ్మెదలు—రకరకాలైన పూలపై వాలినట్లు మానవుడు కూడా ప్రపంచములో పైపై ఆకర్షణకు లోబడి పతితుడవుతాడనే ఉద్దేశ్యంతో, ఈ తాత్త్విక గేయాలలో, తుమ్మెదపదాలను వాడినారు. ఈ పదాలలో శృంగారము కూడా ఉండవచ్చు. బహుశః భాగవతంలోని గోపికా గీతాలు. ఈ పదాలకు ప్రేరేపకం కావచ్చు.

అన్నమయ్య తుమ్మెదపాటలు :

తొల్లింటివలెగావు తుమ్మెదా ఇంక
వొల్లవుగా మమ్ము నో తుమ్మెదా ॥
తేరంపు రచనల తుమ్మెదా కడు
దూరేవు గొండులే తుమ్మెదా
దూరినా నెరగవు తుమ్మెదా మమ్ము
వోరగా చూడకు తుమ్మెదా ॥

(అ.సం. 4-9)

ఈ తుమ్మెదపాటల ప్రతి పాదం చివరిలోను తుమ్మెదా, అని ఆవృత్తి అయినది. ఈ ప్రపంచములోని అజ్ఞానాంధకారంలో కొట్టుమిట్టాడుతున్న ఒక సామాన్య మానవుని చిత్త చాపలాన్ని వ్యక్తపరచడం. ఈ తుమ్మెద పదాలలో కనిపిస్తుంది. ఇక్కడున్న తుమ్మెద మామూలు తుమ్మెద కాదు సాక్షాత్తు శ్రీ వేంకటేశ్వరుడే.

## 2. చిలుక పదాలు:—

సంస్కృతంలో చిలుకను శుకః అంటారు. సాధారణంగా చిన్నపిల్లలు మాట్లాడే పలుకులను, 'చిలుకపలుకులు' అంటారు. పూర్వకాలములో రాజుల యొక్క ఆస్థానములో కూడ చిలుకలకు మాటలు నేర్పుతూ పోషించేవారట. ఆ చిలుక రాబోయే కీడును, మంచిని కూడా ముందుగానే బోధించేవి. చిలుక శుకమహర్షిని సూచిస్తుంది. పరీక్షిత్తు మహారాజుకు భాగవతమును బోధించిన వాడు శుకుడు. సరస్వతీదేవి మూడవచేతిలో వుండేది చిలుకే. తమిళంలో చిలుకపాటను కిళి

పాట్లు అంటారు. భగవంతుడు చిలుకరూపంలో ప్రత్యక్షమై రామాయణ, భారతాల్ని గానం చేశాడని ప్రతీతి. 'చిలుక' శబ్దానికి ఇంతటి ప్రాధాన్యం వుండడంవల్ల చిలుక పదాలని పాడతారని చెప్ప వచ్చు, లోకవ్యవహారంలో చిలుకపాటలు ఈ విధంగా ఉంటాయి.

జీవాత్మమైయుండు చిలుకా నీ
వావలికి పరమాత్మదై యుండు చిలుకా
ఆత్మపంజరములోన నయమున నుండి నా
చేతనే పెరిగిన చిలుకా
జాలిగా గర్మపు సంకెళ్ళబడి కాల
ు తిపే చిలుకా

ఈ పాట్ల పాదాంతములలో చివరిన చిలుకా అనే మాట పదే, పదే వస్తుంది. ఇందులో సామాన్య మానవుడు ప్రపంచమాయలో చిక్కుకొని తల్ల డిల్లడం, జీవాత్మ పరమాత్మలకు ఐక్యం చెప్పడం, మొదలైన తాత్త్విక అంశాలు వ్యక్తమౌనాయి.

## జీవాత్మకాలు :

ఆత్మ రెండు విధములు, జీవాత్మ, పరమాత్మ అని వేదాంతములో పరమాత్మ చర్చ తరువాత, ప్రాముఖ్యం వహించేది జీవాత్మచర్చ. జీవాత్మ పరమాత్మల అనుబంధ వినిమయంలోనే, అభి ప్రాయ భేదాలు వచ్చాయి. మరియు ద్వైతం, అద్వైతమని రెండు విధాలు. 1. ద్వైతమనగా భేదాలను చెబుతుంది 2. అద్వైతమనగా, జీవాత్మ పరమాత్మల ఐక్యాన్ని చెబుతుంది. అందువల్లనే జానపద గేయాలలో, జీవ జీవసంబుద్ధి పథకం కల్గిన గేయాలు ప్రచారం పొందాయి. లోక వ్యవ హారంలో ఇది జీవాత్మకాలు :

మయాకారమురా, మమతలలోపడి
చెడితివి గదరా :
ఆడియాసలతో పడు బేగాని
కట్టుకుపోయే దేమిటిరా జీవా
కట్టె బొగ్గులో కాలేటప్పుడు
గవ్వరాదురా నీ వెంబడిసి
ఏటికి నీ యారాటంబింకా
ఎపుడో ఏమో ఎరుగముగా
త్వరపడరా కడతేరెడు
గతి కనుగొనుటా

ఈ విధముగా ఈ పాట చరణము చివరలో 'జీవుడ' అని సంబుద్ధి. పదే పదే చెప్పబడింది. గుర్రాలవలె పరుగులు తీసే కోరికలను ఐహిక సంబంధమైన కోరికలను అణచుకొని ముక్తి పొందమని జీవుని హెచ్చరించబడుతుంది.

## 4 మనసాత్మకాలు :—

నవద్రవ్యాలు అనగా పృథ్వీఅప్ తేజోవాయు రాకాశాల (తర్క-అని చెప్పబడినది. ఇందులో తొమ్మిదవది మనస్సు. 'అంతరింద్రియం మనః' (తర్క సంగ్రహే) అనగా ఎదుట వారికి చెప్పడం కన్నా ముందుగా తనకు తాను చెప్పు కోవడం ఉత్తమపద్ధతి, మనిషి బంధీ కావడానికి, విముక్తుడు కావడానికి, మనసే కారణమౌతుంది అందువల్లనే వాగ్గేయకారులందరు 'మనసాంతకృతులు' వ్రాశారు.

## మనసాత్మకాలు

నిచ్చ నిచ్చ గాల మెళ్ళ బుచ్చక
సచ్చిదానందమైన శివుం దలచే మనసా
కాయమది మాయకెడ కాయకా
శివాయ న్నమోయని తలచవే మనసా'
(అ.సం)

ఈ మనసాత్మక పాటలలో ప్రతిపాదం చివరిలో 'మనసా' అనే మాట పదేపదే వస్తుంది. మానవుని మనస్సు చంచలమైనది. మనుష్యునకు

సుఖాలవల్ల నష్టాలేతప్ప ప్రశాంతత వుండదని తెలిసికూడ మళ్ళీ ఆ సుఖాలవైపేమనసు పరుగులు తీస్తుంది. అలాంటి మనస్సుకు హితబోధ చేయడం ఈ మనసాత్మక కీర్తనలలో వివరించడినది.

## 5 హంస పదాలు :—

ఇది 'సోహం' యొక్క విఘట రూపం' హంసకు పాలు, నీళ్ళను వేరు చేసే శక్తి ఉంది. సహజంగా విజ్ఞానానికి గుర్తు తెలుపురంగు. హంస తెల్లనిది. కాబట్టి విజ్ఞానానికి ప్రతీకగా, ఈ పదాన్ని వాడారని చెప్పవచ్చు. విశిష్టజ్ఞానం పొందిన వారు హంస నామధేయులవుతారు, విశిష్టజ్ఞానం పొందినవారు రామకృష్ణ పరమహంస మొదలగువారు మరియు సోహం తత్వాన్ని అర్థం చేసుకొన్నవారు. (అద్వైత సిద్ధాంతాన్ని) హంసలే కాబట్టి 'హంస' అనే పదంతో 'హంసపదాల్ని' వ్రాశారని చెప్పవచ్చు.

అన్నమయ్య హంసపదాలు

దిబ్బలు పెట్టుచుదేలిన దిదిగో
ఉబ్బు నీటిపై నొక హంసా
అనువున గమల విహారమే నెలవై
వొనరి వున్న దిదె వొక హంసా
మనియెడి జీవుల మానస సరసుల
వునికి నున్న దిదె వొక హంసా
(అ.సం. 1–16)

ఈ చిఱుక పాటల పదముల చివరిలో హంస అనే మాట పదే పదే వస్తుంది ఈ పాటలో ఒక హంస సరస్సులో విహరించడం, పాలు నీళ్ళు వేరు చేసి, పాలను త్రాగడం కల్గియుండడం, గ్రుడ్డుపెట్టి రెక్కల్లోదాచుకొని పొదగడం, మొదలైన క్రియలు చేస్తే రెండవ హంస ప్రాణుల మానస సరోవరాల్లో విహరించడం మంచి చెడుల్ని వేరు చేసి, మంచిని స్వీకరించడం ఒక్కొక్క రోమకూపం నుంచి విశ్వ సృష్టిని కలిగించడం మొదలగునవి చేస్తుంది అనగా ఇక్కడ రెండవ హంస శ్రీవేంకటేశ్వరుడు.

## కర్మమా చలనాత్మకం కర్మ

(తర్క సంగ్రహే)

మానవునకు ఏదైన ఆపత్తు సంభవించి నప్పుడు అది నాకర్మ అని సహజంగా కర్మపదాన్ని వాడుతుంటారు. ఈ విధముగా జరిగిన సంఘటన లను తలచుకోవడమే కర్మ అని అంటారు.

కర్మను గురించి పాట

ఎన్ని బాధలఁబెట్టి యేచెదవు నీవింక నెంత
కాలముదాక గర్మమా
మన్నించుమనుచు నీమఱఁగు జొచ్చితిమి
మా మాటలాలకించవో కర్మమా
(అ.సం–1–284)

ఈ విధముగా కర్మగురించి ఎన్నో పాటలు వ్రాయబడినవి. మరియు కర్మ గురించే గాక, కలి యుగము, కాపురము, చదువు, దైవమా.నాటకము, మాయ, సంసారము మొదలగు వాటి గురించి పాటలు ఈతాత్విక గేయాలలో ఉన్నవి.

ఈ సృష్టిలోవుండే సమస్తం విభిన్న స్వరూప స్వభావాలతో ఎల్లప్పుడు పరిణామం చెందు తుంటుంది, కాని ఏవిధమైన మార్పు లేకుండా శాశ్వతంగా, స్థిరంగా వుండేది ఒక పరబ్రహ్మమే ఈ పరబ్రహ్మ మయమైన ప్రపంచంలో తెగలు తెగలుగా విభజించి, న్యూనతాధిక్యతలను చూప వలసిన పనిలేదు. సమస్తజీవుల శ్రీహరే

పాట॥ తందనాన అహి తందనానపురే
తందనాన భళా తందనాన ॥పల్లవి॥

బ్రహ్మమొక్కటే పరబ్రహ్మమొక్కటే పర
బ్రహ్మమొకటే పరబ్రహ్మమొకటే ॥తంద॥
కందువగు హీనాధికములిందు లేవు
అందరికి శ్రీహరే అంతరాత్మ
ఇందులో జంతువుల కులమంతా వొకటే
అందరికి శ్రీహరే అంతరాత్మ ॥తంద॥
(అ.సం॥7-151)

కాబట్టి అందరూ సమానులే ఈ విధముగా అన్నమయ్య సంకీర్తనలలో తాత్విక గేయాల గురించి చాలా పాటలు మధురంగా రచించబడినవి.

అన్నమయ్య సంకీర్తనలలో తాత్విక గేయాలు తన తరువాతి వారికి వెలుగు బాటయైనవి. శ్రీవేంకటేశ్వరునర్చించి ఆత్మ కళ్యాణంతో పాటు, లోక కళ్యాణమునుకూడా సాధించిన మహామనిషి అన్నమయ్య మహాకవులకు భాష భావము, సహజముగ సమకూరును. రాగ, రస, భావ, భాషలతో అన్నమయ్య పదాలు సమగ్రమై, సుందరసుమములుగా కుసుమించి, భక్తి పరిమళములు వెదజల్లుచున్నవి.



# 'తెలంగాణా జనజీవిత భారతం'—కుందుర్తి 'తెలంగాణా'

కలువకుంట రామకృష్ణ

కవితాలక్ష్యాన్ని స్పష్టంగా నిర్ణయించుకొని సామాన్యుని కోసం కలంపట్టి అభ్యుదయ మార్గంలో నడిపించిన కవి కుందుర్తి. మానవతావాదాన్ని మన్నించిన మార్క్సిస్టు దృక్పథం కుందుర్తి కవితలో అగుపిస్తుంది. —వచనకవిత్వంలో వెలువడ్డ తొలిసమగ్ర చారిత్రక కావ్యం 'తెలంగాణా' తెలంగాణా పోరాటాన్ని వస్తువుగా గైకొన్న రచనల్లో దాదాపు చివరిదని చెప్పవచ్చు. ఈ కావ్యం విప్లవ పోరాటాన్ని వర్ణించడంలో కావ్యశిల్ప మర్యాదల దృష్ట్యా ఉత్తమమైనదిగా చెప్పవచ్చు.

'తెలంగాణా' కావ్యం తెలంగాణా ప్రజల జీవితేతిహాసం. పద్దెనిమిది పర్వాలున్న ఈ వచన కావ్యాన్ని 'తెలంగాణా జన జీవిత మహాభారతం'గా పేర్కొనవచ్చు. ఇందులో—వరుసగా— ప్రస్తావన, సింహాసన, బీజోత్పన్న, సంఘోదయ, ప్రజోద్యమ రాయబార, బహిష్కార, భూమిదాన, రజాకార, మానభంగ, గృహదహన, దండయాత్ర, ఉప సంహారము మొదలైనవి కలవు.

తెలంగాణాలో జనజీవిత మహాభారతానికి రూపు దిద్ది, 'తెలంగాణా' కావ్యశిల్పం సృష్టించిన మహాశిల్పి కుందుర్తి ఆంజనేయులు. ఈ కావ్యం ఆద్యంతాలు చదివితే. తెలంగాణాలో అనాడు ఏమి జరిగిందో కళ్ళకు కట్టినట్లు కన్పిస్తుంది.

'ప్రస్తావన' పర్వంలో స్వాతంత్ర్యానికి పూర్వం జరిగిన చరిత్ర భారతదేశానికి విదేశీయులరాక. వారికి దేశప్రజలు బానిసలు కావడం, దేశం ఛిన్నాభిన్నం కావడం. మొదలైనవి వర్ణింపబడ్డవి.

'బతుకుపూలు తొడిగిన రేకుల్లో, ఒక్కటేరంగు ...అది నలుపు' అని పేర్కొనడం వల్ల, అనాటి ప్రజల జీవితాల్లో కారుచీకట్లు నిండుకొని ఉన్నాయని వర్ణించబడింది.

'సింహాసన' పర్వంలో—హైద్రాబాద్ సంస్థానంలో భూస్వాముల వల్ల ప్రజలు పొందిన బాధల్ని వారి నిరంకుశత్వాన్ని వివరించారు. 'బీజోత్పన్న' పర్వంలో నిజాం పాలనలోని దురాగతాలు, ప్రజల దుఃఖమయ జీవితాలు, మానప్రాణాల్ని బలిగొన్న అధికారుల దుర్మార్గం వర్ణించబడింది 'సంఘోదయ' పర్వంలో 'ఆంధ్రమహాసభ'—తెలంగాణాలో ఆవిర్భవించిన విధానాన్ని కవి మనోజ్ఞంగా వర్ణించారు. అదే సందర్భంలో—

'తెలంగాణాను వర్ణించటానికి
తెలుగులో మాటలు చాలవు
.....దానిని అందుకే
అంటున్నాను—"తెలంగాణా"—అని

హాస్టల్—బి, 203, హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం, గచ్చిబౌలీ, హైదరాబాద్—134

— ఈ ఖండిక లో కుందుర్తి ఆనాటి స్థితి గతుల్ని సరిగ్గా అంచనా వేసినారు.

'ప్రజోద్యమ' పర్వంలో అణగారిన జీవితాల్లో చైతన్యం వచ్చి, అందరూ ఒక్కటై, తమ స్వాతంత్ర్యం కోసం సంఘాలేర్పర్చుకుని ఎదురు తిరగటాన్ని, భూస్వాములపై తిరుగుబాటును గూర్చి, 'రాయబార' పర్వంలో ప్రజల తిరుగుబాట్లను అణచడానికి, భూస్వాములు నిజాం సహకారాన్ని కోరడం గూర్చి, ప్రభువు సైనిక పటాలాల్ని పంపగా, వాటిని అండగా చేసుకొని, జాగీర్దారు చేసిన దుష్కృత్యాల్ని గూర్చి వివరించబడింది.

ఇక—'మానభంగ', 'గృహదహన' అనే పర్వాల్లో పోలీసులు చేసిన మానభంగాలు, లూటీలు, దహనకాండలు మొదలైన రాక్షస కృత్యాలన్నీ వివరించబడ్డాయి. 'రజాకార' పర్వంలో—నిజాం నవాబుచేత పరోక్షంగా పెంచి, పోషించబడిన రజాకార్లను, వాళ్ళ అకృత్యాలను వివరించాడు—కవి. "దండయాత్ర" పర్వంలో యూనియన్ సైన్యాలు నిజాం పాలిత ప్రాంతాన్ని, నిజాం కోరల నుండి విముక్తి చేసిన వైనం వర్ణితమైంది. ఈ విధంగా పద్దెనిమిది భాగాలుగా విభజితమైన 'తెలంగాణా' కావ్యం—మహాభారతాన్ని తలపింపజేస్తున్నది.

'కవిత్వానికి ఆవేశం ప్రధానంకాదు—ఆర్తి ప్రధానం' ఈ ఆర్తే కుందుర్తి కవిత్వంలో కన్పిస్తుంది. ప్రజాపోరాటాల సిద్ధాంతం మీద, ఒక నిర్దిష్టమైన అవగాహన ఉన్న కుందుర్తికి తెలంగాణా పోరాటం భరింపరానిదీ, సహించరానిదీ అన్పించింది. ప్రభువుల్నీ, పెద్దల్నీ 'బలాదూర్' అనగల్గిన గుండెధైర్యం, సామాన్య మానవాళిని అదరించే మంచిమనసూ...సమ సమాజ దృక్పథం కల్గిన కుందుర్తికి, 'తెలంగాణా పోరాటం' కావ్య వస్తువైంది.

"మనం నివసించే భూమి గుండ్రంగా ఉంది
భూస్వాముల చేతుల్లో
వందల వేల ఎకరాల పూర్ణాంకాల్లో
గుండ్రంగా ఉంది"-అంటూ తెలంగాణా

పోరాటానికి అసలు సమస్య "భూసమస్య" అని పేర్కొన్నాడు—కుందుర్తి.

"ఈ నేల ఎవరిది? కోటి ప్రజల సొత్తుగదా
కొందరు వద్దంటే ఒప్పుకోని చరిత్రా!
ముందుకు సదా! ..." అని కవి, ఆనాడే

తెలంగాణా జనవాహినికి చైతన్యం కల్గించాడు.

కుందుర్తికి ప్రజలమీద గాఢ నమ్మకం. ప్రజోద్యమాల పై సిద్ధాంత పరమైన ఆసక్తి-బలం ఉన్నాయి. అందుకే- "క్రమాక్రమానుగత
చైతన్య ధనుష్పాణులు
ప్రజలు నేడు-
సమాజ సమిష్టి
ప్రయోజన నిశిత బాణులు
ప్రజలునేడు! "... అంటూ

విప్లవాల శక్తిని జనం కంఠబలాన్ని యుగం ఉచ్ఛ్వాస నిశ్వాసాల వాడిని సూటిగా విన్పిస్తాడు.

'తెలంగాణా' విప్లవ ప్రభావంతో ఉత్తేజితులైన కవులు, కుందుర్తి కంటె ముందు లేకపోలేరు. కాని, తెలంగాణా విప్లవ చరిత్రను, వాడుకభాషలో ముక్తచ్ఛందంలో, 'ఆధునిక మహా భారతం'లా తీర్చిదిద్దటం—ఈకావ్యం ప్రత్యేకత.

'సింహాసన' పర్వంలో-

'మనదేశం కడుపులో
పుట్టిందొక మహావ్రణం
ఎప్పుడు మరి దాని, శస్త్ర
చికిత్సకు తరుణం?'
—అని ప్రశ్నిస్తాడు-కవి

దీన్ని బట్టి కుందుర్తిలో రాజకీయాలోచనలూ, ప్రజల బాధల్ని విని తపన చెందడం, భూస్వామ్య వ్యవస్థపై వెగటు, గుండెల్లో కుతకుత మంటున్న కసి, ఆది నుంచీ సైద్ధాంతిక ప్రేరణ మొదలైన ఈ అంశాలన్నీ సమాహారంగా ఉన్నట్లు, ఈ కావ్యం ద్వారా ద్యోతకం అవుతుంది.

'ఒక మూడు దశాబ్దాలకు
ముందరిమాట
ప్రజలు పడిన పొరపాటు
(చ) చరిత్ర పడిన తొందరపాటు
మనదేశ చరిత్రను
ద్రోహపు సర్పం
కాటేసిన చోటది''

—అని, దేశద్రోహంతో నవాబు పాలకులు చేసిన మోసాల్ని ఎలుగెత్తి చాటిన ప్రజాకవి—కుందుర్తి. ఈయన తాను చెప్పదల్చుకున్న అంశాన్ని డొంకతిరుగుడుగానో, గోడమీది పిల్లివాటంగానో, కాక నిర్భయంగా, నిర్మొహమాటంగా చెబుతాడు. ఈ విషయాన్నే ఇతని కవిత్వం ద్వారా మనం స్పష్టపరుచుకోవచ్చు.

'పర రాజులు నిద్రొక్కుకునేందుకు
చేసిన సహకారానికి ఒక జానెడు నేల
ప్రతిఫలంగా
గడించిన సింహాసనమది !
ఆ చంద్రతారార్కం చరిత్రలో పేరు నల్లగా
నీచపు ద్రోహిగా
ప్రాయించుకోను చేసుకున్న నిర్ణయం
తెచ్చిపెట్టిన సింహాసనమది'

అంటూ రాజీలేని, అనుమానం లేని మాటల ఈ దెబ్బతో విషయాన్ని వివరించటం, కుందుర్తి కవితాశక్తిలో వినిపించే విప్లవ భావతరంగాలకు

తెలంగాణా ఉద్యమంలో దేశముఖులు, రజాకార్లు, సైనికులు, ప్రభువులు—వీరంతా కలిసి చేసిన పాపాలూ, ఘోరాలూ, తలుచుకుంటేనే ఒళ్ళు గగుర్పొడుస్తుంది—అంటూ.

'ఒక రైతు పొలంపోయి
ఇల్లు చేరుకునే సరికి
ఏలిన దొరవారి ఘనమయిన సేవకులువచ్చి
పెళ్ళాం పుస్తెలు కాజేశారు.
ఒక కూలి పొలంపోయి
ఇల్లు చేరుకునే సరికి
ఏలిన దొరవారి ఘనమయిన సేవకులువచ్చి
పెళ్ళాన్నే జప్తు చేశారు.'

అని 'బీజోత్పన్న' పర్వంలో చెప్పిన వాక్యాలు, కవి భావవ్యక్తీకరణ శైలికి దర్పణాలు. భరించలేని దౌర్జన్యాల్ని ఒకే ఒక్క మాటలో మనకు స్పష్టంగా చెప్పగల్గడం—నిజంగా ఎందరు కవుల్లో కనబడుతుంది?

ఉండబట్టలేక కవి హృదయంలో సానుభూతి తరంగాలు ఉవ్వెత్తున ఎగిశాయి. దౌర్జన్యాన్ని భరించలేని కవి హృదయంలో ఆర్ద్రత నుండి నిప్పులు కురిసే స్థాయికి ఎదిగే లక్షణాలు గోచరించాయి.

'స్వార్థం క్రమ్మిన కారుమబ్బులు
రాజరికపు చలి గాలి విసురులో
నేల నాలుగు చెరగులా యెడతెగని
అధర్మపు వాన ముసురులో
బలిసి బలిసి నానా బాధామయ గాథలు
చివరకు లొంగుతాయి

కొండలలో కోనలలో పారి పారి
ప్రజా వాహినులు గట్లు తెగి పొంగుతాయి'

—ప్రజలశక్తిని దర్శించి, ప్రజలకు కర్తవ్యబోధ చేసినవాడే నిజమైన కవి' అనవచ్చు. ఈ లక్షణం ఈ కావ్యం ప్రథమ లక్ష్యం. శాపగ్రస్త గుండెల్ని దర్శించిన కవికి, ప్రబోధం చేయవలెనన్న తపన అధికమైంది. తాను చేసే ప్రబోధానికి ప్రవాహంలా వస్తోన్న రేపటి వెలుగును కూడా చూడగలిగాడు. ఆ వెలుగును ఆయన కలం లోంచి వెల్లువలుగా, ప్రజల ఆశల తోరణాలుగా అలంకరించాడు.

'జనం నిద్రలేదాక
సత్యం చూసి పొడిచే పొద్దులాగా
ప్రతిపల్లె హృదయంలో
ఒక దాక్కున్న హృదయం ఉంది...'
'ప్రతి పల్లె మెదడులో
ఆలోచన మందులిచ్చే ఆసుపత్రి ఉంది...'

—అంటూ గెరిల్లా వీరులు నడిపిన ఉద్యమం తీరుతెన్నులు వివరించాడు. ఈ వివరణలో కవి చూపిన నర్మగర్భత, భావనాశక్తి వచనకవితా విన్యాసం అవన్నీ కలిపి ఒక ముత్యాల సరమై, ఆయన వ్యక్తిత్వానికి తార్కాణంగా నిలుస్తాయి.

నిత్య విప్లవశీలమైన సాహిత్యం మోడు వారదు' అన్నాడు—ఆర్నాల్డ్. అలాగే విప్లవాత్మకమైన సైద్ధాంతిక బద్ధమైన— కుందుర్తి మరో 'భారతం' కూడా చీకట్లో కాంతులు విరజిమ్మే ఒక దీపశిఖ।

కవే—'ఉపసంహార'లో పేర్కొన్నట్లు- వచన కవితాశైలి, వస్తువుపై పట్టుగల కావ్యంగా, ముఖ్యంగా తెలంగాణా పోరాటానికి చక్కని ప్రతిరూపంగా ''18 పర్వాలతో కూడిన మరో భారతం''గా ఈ కావ్యాన్ని చెప్పవచ్చు. అయితే ఈ భారతానికి తెలంగాణా జన జీవితం-చిత్రణం అనే ఫ్రేమ్ ఉన్నదన్న సత్యాన్ని మరచిపోగూడదు. కుందుర్తి లాంటి కవులు 'నభూతో నభవిష్యతి'గా చెప్పవచ్చు.

# కవితావీథి

## రామ బాణము

—ఊట్ల కొండయ్య

(గత సంచిక తరువాయి)

పరిపరి విధమ్ములై
వ్వారికెట్టులు తోచెనట్లు ప్రజ లమ్మునితో
నరుగుచు నాగుచు భక్తిక
దుర గుంపులుకూడి పలుక దొడగి రిటనటన్

ఈ పుణ్యపూరుషుడేనమ్మ భరతుని
జనయిత్రినిం గన్న మునివరుండు
నడునకై నాకమ్ము విరచించినట్టి బ్ర
హ్మర్షి యీతండెయౌనటకదయ్య
సిద్ధాశ్రమమున విశుద్ధచారిత్రుం
సృష్టించు మేటి దేశికుడితండె
తనతోడబుట్టు బెట్టిననేల తనకు త
పోభూమియగు కూర్మిప్రో నితండె

దైవకార్యమ్ములకు నిమిత్తమ్ము కాడు
ముజ్జగము లెదిరిన వెనుబోనివాడు
నరుల సంరక్షణమున ముందయినవాడు
కన్నతండ్రి చేతు పలుకకున్నవాడు



కాటూరి కవితాపీఠం, మాధవి ప్రింటర్స్, కుత్బిగూడ, హైదరాబాద్-27.
నవంబర్ 94 : ప్రవ-తి ; 29

ఆకదమాటతో జనపదాగ్రణియెల్లర మోహరింపగన్
మోకరిలెన్ జనమ్ము మునిపుంగవు నల్దెసపాదమెత్తగా
నీకయెవారిమధ్యమున నే మునియట్టులె కూరుచుండి తా
నాకమలాసనుండనగ నయ్యెడకోచె స్మితాననమ్ముతోన్ 16

తియ్యనికలతో మేల్కొని
నెయ్యమ్మున నవ్వుటాలనింబోలిన యా
యయ్యంగవి యానందం
బయ్యెన్ బాష్పములు వారియందరి కనులన్ 17

కలకలమని యాప్రజలులేచిచేయు జ
 యధ్వనుల్ దిశల్ప్రతిధ్వనింప
భగవత్స్వరూపు డాపరమర్షి యొక్క శ్రీ
 లావితర్ది తన నలంకరింప
గృహిణులు ఫలములు క్షీరమ్ములును ముని
 పాద సన్నిధి సమర్పణ మొనర్ప
ముని పరివేష్టించి జను లమ్మహాత్ము దే
 మనునోయను ప్రతీక్ష ధరింప

మునివరుడు వారిపైని దీవనలు చల్లి
చిట్లు ప్రవచింప దొడగె, నీరెత్తినట్టి
నిమ్మళా భాస్థలి మెల్లనీరప్రీమయి
వాగమృతమాని తన్మయత్వమ్మునంద. 18

స్వేదమునూడ్చి ధారుణి పసిండిని దీయ సమర్థులైన నా
సోదరులార! జీవన విశుద్ధత యేయెడ తాలిబొట్టుగా
పేదరికమ్మె బొట్టుగమ, పీడని హాసమె జీవయాత్రగన్
వేదనలన్ భరించు గృహిణీమణులార: శుభమ్ముమీకగున్ 19

ఒకదైవకార్యమున పూ
నికపడి యేగుచుంటినికదయ్యా స!
ల్పకుడు ప్రియనిరోధము మీ
యకలంకాతిథి సపర్యలందెన్ మాకున్ 20

దారిద్ర్యమ్మున్ కృషితో
వారింపం జూచు మిమ్ము వర్ధిల్లగనీ
రైరి దనుజాధములు, సం
సారమ్ముల దోచి రూపుమాపు టెరుగుదున్ 21

పుణ్యముల ప్రోవయిన మనభరతమాత
ఇట్టి యగచాటులకు నెర దెట్టులాయె!
మూలముట్టుగ దాని నిర్మూలనకయి
విధి యిటుల నీని నీయాత్రవెడలదీసె 22

చనియెదనింక నన్న ముని సన్నిధి కైదువరాలొకరై చ
య్యనచని, పచ్చినీరయిన నానకపోయెదనందు వీవు, నీ
తనయులు, పుత్రులడ్డుపదదాటి చనన్ మనసెట్లువచ్చె? మా
జనకుడ వంచు నెంచితిమి, జాలియొకింతయు లేదె మాపయిన్ 23

లోకక్షేమమ్మే నీ
కేకైక వ్రతము తండ్రి! ఇతరులెవ్వరికిన్
కుకున్న, లోకులము నీ
కైకొంచెమొ చేయు పుణ్యమేల కద పెదో?
పోదునని పాటపాడెదవు కద, పొమ్ము!
నీవు ధర్మజ్ఞుడవు తండ్రి! నేడు మేము
పుట్టి మొక మెతుకేని నీ పుణ్యమాన
పిల్ల జల్లలు ముదుసలు లెల్లవారు. 25
అనగనోరార నవ్వుచు నమ్మునీంద్రు
డైన వచియింపుమమ్మ నీ పన్నయట్లే
యగునుగాకను చాయమ్మయందజేయు
ఫలములు భుజించి క్షీరసేవనమొనర్చె 26
అన్నా! నుదుపుమును చాయమ గ్రామ్రవ
ముఖుజీర నతడు సమ్మోదభరమున
మునిబాలులకు మ్రొక్కి యనె, మహాత్మా! వల

దన్న పానము. లనిరాదరణము
దేహ మ్మఖిల ధర్మవాహనమ్మగుట శ
రీరక్షణము సేత లెస్సకాదె
గీ. వ్యాప్తిదూరాన కలదు గ్రామము వారి
ప్రార్థనమ్మున కనుగ్రహమువలయు

ఒక్క యూరివారు మరొక్క యూరుజేర్తు
రింతవదరిననుక్షమియింపుమనిన
వాని మెచ్చి, యెల్లరకు దీవనలనిచ్చి
జను లనుగమింప మౌని నిష్క్రమణమందె

# రెండు సముద్రాలు ఒకటైన దృశ్యం

అడిగోపుల వెంకటరత్నమ్

చనిపోయినవాడు, పుట్టని వాడు తప్ప
సత్పురుషుడెవ్వడూ లేడని సమస్యల్ని విడనాడి
చేతుల్లేని చప్పట్లు చేసి
పారిపోవడం పలాయన వాదం!
ప్లవించిన మోడును వాడి పొమ్మందామా
తుళ్ళిపడి పారే సెలయేరును ఆగిపొమ్మందామా
వర్షించబోయే మేఘాన్ని పారిపొమ్మందామా
నెత్తిన దుప్పట్లు పరచి సూర్యకాంతిని అడ్డుకుందామా
లేక వాటిని వశంచేసి ఆవిష్కరించుకుందామా.
కాడెత్తగానే కర్తవ్యం గుర్తించి
అరుమోపిన ఎద్దును గుర్తుంచుకుందాం
చెట్టూ పుట్టా తిరిగి గూట్లో పిల్లలకు
కడుపు నింపిన పక్షిని జ్ఞప్తి వుంచుకుందాం
ఒక ఇటుక పేర్చడానికి ఎన్ని చేతులు శ్రమించాయో
ఒక రోజుగా మారడానికి ఎన్ని గంటలు
కరిగి పొయ్యాయో
పనిముట్టుగా మారడానికి కరిగిన ఇనుము
మార్గదర్శకం!
నిజమే....
"నిన్న" అతడి స్వంతం
"నేడు" అతడి ఆటబొమ్మ
ఒక వెలుగునుండి, ఒక విశ్వాసంనుండి
ఒక సంకల్పం నుండి ఒక సమూహం నుండి
"రేపు" అందరి కోసం
నేడు అందరి ప్రతిఘటన!
రెండు సముద్రాల్ని కలుపుతూ
ఒక మానవ నిర్మిత కాలువ
రెండు సముద్రాలూ ఒకటైన దృశ్యం
పలాయనం పాటకు కోరస్ పాడకు
స్వప్నావిష్కరణకు జోకు చెయ్యకు
నిష్క్రమణకు దారిలేదు
పలాయనానికి తావులేదు
పథం నిర్దేశించు...

నాగార్జున యూనివర్సిటి, గుంటూరు–522 510.

# కీలకం

ఆంగ్ల మూలం
జార్జి హెర్బర్ట్

తెనిగింపు
ఎస్. మయూరి

దేవుడు తొలి మానవుణ్ణి సృష్టించినపుడు
ప్రక్కన ఒక వరాల చెంబు నుంచుకున్నాడు
'అంతా వాడిమీద కురిపిద్దాం' అన్నాడు
ప్రపంచంలోని సమస్త భాగ్యాలు ఒక్కచోటికి
రానీ!"
మొదట బలం వెళ్ళింది, అందం దాన్ని అనుస
రించింది
దానివెంబడి సంపదా, తెలివీ, గౌరవం
ఆనందం అనుగమించాయి
దాదాపుగా అన్నీ అయిపోయేంతలో
ఆ పరమాత్మ చటుక్కున ఆగాడు
అ వరాలన్నింటి చివరా 'విశ్రాంతి' ఉండటం
చూసి
ఈ రత్నాన్ని కూడా నాసృష్టికి వరమిస్తే
వాడు నన్ను విడిచి నా కానుకలను సేవిస్తాడు
సృష్టి కర్తనైన నాలో కాక ప్రపంచంలోనే
పరవశిస్తాడు,
దానితో ఇద్దరం నష్టపోతాం
తక్కినవన్నీ తానే ఉంచుకోనీ!
నిరంతర అశాంతితో ఉంచుకోనీ!
భాగ్యవంతుడైనా బాధపడుతూ,
మంచితనం నానికి నన్ను చేరే మార్గం చూపక
పోయినా
వేసరక వాణ్ణి నాఎదకు విసరనీ!

ఆంగ్లోపన్యాసకురాలు, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, పెద్దపల్లి, కరీంనగరం జిల్లా.

కన్నడ కవిత

# క్రొత్త పుట్టుక

మూలం
జి. శివరుద్రప్ప

"ఎత్తుకో నన్ను
వదులు నీరాజభవనపు తెలికొలనిలో
పిదప ఏటిలో,
మళ్ళీ నేను పెరిగిన తర్వాత మున్నీటిలో:
ఏమిటి? ఎందుకు? అనే అనుమానం వద్దు
అర్థమవుతుంది–అంతా–చివరకు
దోసిటిలోకి వచ్చిన చిరుచేపను
చూశాడు మనువు,
దాని విచ్చిన కన్నుల్లో ప్రతిబింబించింది
ఉదయపుచదలు
అరుణోదయపు ప్రశాంతమౌనంలో
మర్మరిస్తూ ప్రవహిస్తూవుంది నది–
తనకు తాను
ఏమాశ్చర్యం!
అర్ఘ్యమెత్తిన చేతిలోకి చేపరావడమేమిటి?
మళ్లీ నన్నలా అడగడ మేమిటి?
విచిత్రంగావుంది అంతా!
నమ్మటం మంచిది;
అనుమానం మంచిదికాదు."

అనువాదం
శంకరగంటి రంగాచార్యులు

మొదట రాజభవనపుటుద్యానవు కొలనులో
పెరిగింది చేప దినదినమూ
పిదప ఏటిలో
తదుపరి బ్రహ్మాండంగా కడలిలో
ఈదింది అలలను చీల్చి,
బడబాగ్నిని ప్రజ్వలిస్తూ తన కనులలో.
చూస్తూ గట్టున నిలుచుండిన మానవునకు
చెప్పింది మళ్లీ:
"విను, నేను చెబుతున్నాను, విషయం
సరిగా విను.
నీవు ఈయుగపు మనువువు
వచ్చేయుగం భారాన్ని భుజస్కంధాలమీద
మోస్తున్న వాడవు;
ఈయుగం ముగిసే సమయం–అసన్నమైంది
మార్పు అవసరం
చక్రం తిరగడానికి.
ఇప్పుడు మూలజలం కలగిపోయివుంది–
బురద లోనా బయటా
కుళ్ళి వాసనకొడుతోంది, తీర్థం;
దేవాలయపుమూర్తులు భగ్నం;
త్రాసుఅంతా తలక్రిందులు;

రిటైర్డ్ హెడ్మాష్టర్, 6/685–ఎ, రాంనగర్, అనంతపూర్–515 004.

తినే అన్నంనిండా రాళ్ళు
ఎక్కడకంటే అక్కడ పెరిగింది దండకారణ్యం.
గద్దలూ, తోడేళ్ళూ—రాక్షసరాజ్యం.
దారి ఒకటే
ఉన్నదంతా రొట్టెవేసి పట్టవలసివుంది మళ్ళీ
కొత్త జగం
నీవందుకు నిమిత్తమాత్రుడవు.
కట్టు ఒక ఓడను,
సేకరించు ఒకచోట రేపు విత్తడానికి తగిన
విత్తులను
నీవూ, నీ పరివారం,
ఇంకా ఒకిన్ని ఉత్తమజాతులను
వస్తుంది రేపు ప్రళయం.
తుడిచివేస్తుంది ఉన్నదాన్నంతా నిశ్శేషంగా
నేను పట్టుకుని, రక్షిస్తాను.

నీవుకూర్చున్న ఓడను కొత్తపుట్టుకకోసం"
"నాకువద్దు" చేతులు మోడ్చి చెప్పాడు మనువు
"నాకువద్దు
ఉన్న ఈసమస్తాన్నీ నిర్నామంచేసి
రేపటిరోజు నేనూ, నా పరివారం మిగిలి
బతికే భాగ్యం—నాకువద్దు.
ఈడ్చుకుని,ఈడ్చుకునిపోనీ ఈనన్నూ చేర్చుకుని
ఈమహాప్రవాహం
నాకులేదు నేనొక్కడినే, బతకాలన్న దాహం
రేపు పెరగవచ్చు కొత్తమట్టిలో వేరూని
నాలోవున్న మంచి ఏమైనా
కొమ్మల్లో, రెమ్మల్లో పాటమరించి
కొత్త చిగుళ్ళూ
కొత్త పూలూ, పళ్లూ



# మందార మాల

## "వివిధ రామాయణాల్లో శూర్పణఖ పాత్రచిత్రణ"

మదిరె సిద్ధన్న

వింటే భారతం వినాలి తింటే గారెలు తినాలి అన్నట్లుగా చదివితే వేదవ్యాసని భారతం చదవాలి చదివితే వాల్మీకి రామాయణం చదవాలి. రామాయణ భారతాలు వెలుగులో కొచ్చిన తర్వాత వాటిని అనుసరిస్తూ తమ స్వంత కథాకథనంతో చాలా మంది కవులు కావ్యాలు రచించారు. మహాభారతానికి కావ్యాలు సంబంధించి ఏ రెండు మూడు భారతాలో, తప్ప అంతకన్నా ఎక్కువ భారతాలు రచింపబడ లేదు. ఆ రెండు మూడు కూడా ఎక్కువగా ప్రచారంలో లేవు.

కాని రామాయణ విషయానికొస్తే వాల్మీకి రామాయణం తరువాత ఎన్నో రామాయణాలు మన ముందుకు వచ్చాయి నిర్వచనోత్తర రామాయణం రంగనాథ రామాయణం, భాస్కర రామాయణం, శ్రీ మదధ్యాత్మ రామాయణం, ఆంధ్ర వాల్మీకి రామాయణం, జనప్రియ రామాయణం, మొల్ల రామాయణం, రామాయణ కల్పవృక్షం, జానపద రామాయణం, లాంటివి ఇప్పటి వరకు ఇంచు మించు ఒక వందాయాభై రామాయణాలు రచింపబడ్డాయి, అందులో యాభై రామాయణాలు వరకు పుస్తక రూపం దాల్చాయని మనకు, తెలుసు. అన్నింటి గురించి తెలుసుకోలేక పోయినా కొన్నిటి గురించయితే మనం క్షుణ్ణంగానే తెలుసుకుంటున్నాం. వాటి వాటి తారతమ్యాలను చెప్పుకుంటూనే ఉన్నాం.

వివిధ రామాయణాల్లో ఒకే పాత్ర ఎన్నో విధాలుగా చిత్రించబడి ఉంటుంది. అది ఆయా రామాయణాల కర్తలపై, కాలం ప్రభావాలపై, వారి వారి మనోభావాలపై ఆధారపడి ఉంటుంది. అందుకు ఉదాహరణంగా ఒక పాత్రను తీసుకొని వివిధ రామాయణాలను పరిశీలిద్దాం.

రాముడు, సీత, లక్ష్మణుడు వంటి పాత్రలయితే మనం క్షుణ్ణంగా పరిశీలించి ఈ చిన్న వ్యాసంలో పొందపరచలేము. కాబట్టి పాత్రచిన్నదై ఉండి రామాయణంలో ముఖ్యమైన పాత్రలలో ఒకటైన శూర్పణఖ పాత్రను తీసుకుందాం.

ఈ శూర్పణఖ పాత్రను పలు రామాయణ కర్తలు ఎలా చిత్రీకరించారో పరిశీలిద్దాం. కథలో మంచి చెడు రెండింటికి ఒకేరకమైన ప్రాధాన్యం ఉంటుంది. ఎందుకంటే అసలు చెడులేకపోతే మంచికి గుర్తింపే లేదు. అలాగే రామాయణంలో మంథర, శూర్పణఖ పాత్రలు ఉండబట్టే, సీతా మండోదరి

లాంటి పాత్రలకు విలువ కట్ట కలుగుతున్నాం. కొన్ని రామాయణాల్లో ఈ శూర్పణఖను ఏ విధంగా చిత్రీకరించారో పరిశీలిద్దాం.

ముందుగా మూలమైన వాల్మీకి రామాయణంలో శూర్పణఖ ప్రస్తావన అరణ్యకాండలో పంచమసర్గ మందు కనిపిస్తుంది అంటే రాముడు అడవులకెళ్ళి పంచవటి తీరాన పర్ణశాల యందున్నప్పుడు మునులను చంపితింటూ రామలక్ష్మణుల దగ్గరకు వస్తుంది. ఈ శూర్పణఖ శూర్పణఖద్వారే రామ లక్ష్మణులకు లంకా పురవాసులతో మొదటి పరిచయం ఏర్పడుతుంది.

ఆ వచ్చిన శూర్పణఖ రాముని అందానికి ముగ్ధురాలై తనను వివాహమాడమని రాముని కోరుతుంది. అప్పుడు రాముడు తనకు భార్యవుందనీ, లక్ష్మణుడు నిన్ను పెళ్ళాడుతాడు వెళ్ళమని చెప్తాడు. తీరా లక్ష్మణుని దగ్గరకు వెళ్ళితే లక్ష్మణుడు మళ్ళీ రాముని వద్దకే పంపుతాడు. మళ్ళీవచ్చిన శూర్పణఖతో నన్ను చేసుకుంటే నీకు సవతి పోరుంటుంది అంటాడు అందుకు శూర్పణఖ సీతను చంపబోగా ముక్కు చెవులు కోసి శిక్షించమని రాముడు లక్ష్మణుని ఆజ్ఞాపించగా లక్ష్మణుడు శూర్పణఖ ముక్కుచెవులు కోస్తాడు. అక్కడినుండి శూర్పణఖ తిన్నగా అన్న రావణుని దగ్గరకు వెళుతుంది. విషయం చెప్పి రోదిస్తుంది. నీవెలాగైనా ప్రతీకారం తీర్చుకోవాలని పట్టుపడుతుంది. అందుకు రావణుడు సీతాపహరణానికి పూనుకుంటాడు. తర్వాత వాల్మీకి రామాయణంలో శూర్పణఖ ప్రసక్తి మళ్ళీ మనకు కనిపించదు.

ఇక భాస్కర రామాయణంలో శూర్పణఖ పాత్రను ఇంకోరకంగా చిత్రించడం మనం గమనిస్తాం. శూర్పణఖ విద్యుజ్జిహ్వుల కుమారుడు జంబుకుమారుడు. ఇతడు తన తండ్రిని చంపిన వారిపై పగతీర్చుకొనుటకు ఇంద్రుని గూర్చి తపస్సుచేయగా, ఇంద్రుడు మెచ్చి చంద్రహాసమును పంపుతాడు. కాని తన తపోబలమున కిది ఎంతటిదని జంబుకుమారుడు దానిని గ్రహించని సమయంలో లక్ష్మణుడు దానిని గైకొని అక్కడి మునుల సూచనానుసారముగా అక్కడున్న వెదురు వనమును ఖండించగా, అందున్న జంబుకుమారుడు మరణిస్తాడు. కొందరు ఇతడే జంబుమాలి అని వాదిస్తుంటారు. జంబుమాలి ప్రహస్తుని కుమారుడని తెలుసుకోగలరు.

తన కుమారుణ్ణి చంపాడనే కోపంతో శూర్పణఖ రామలక్ష్మణులను చంపడానికి వస్తుంది. కాని రాముని మనోహర రూపాన్ని చూసి కర్తవ్యాన్ని మరిచిపోయి రామునితో తనను మోహించమని అడుగుతుంది. ఇక ఇక్కడినుండి కథ మామూలే. అయితే ఇదే కథాకథనం స్వల్పమైన భేదాలతో రంగనాథ రామాయణమందు కనిపిస్తుంది. విమర్శకులు ఈ జంబు కుమారునికథ వాల్మీకమందు లేదని పేర్కొన్నారు.

తరువాత శ్రీ మదాంధ్రధ్యాత్మ రామాయణంలో శూర్పణఖ ఇంతా చెంచీతగా చిత్రీకరింపబడింది. ఇందులో శూర్పణఖ ప్రవేశం నుండి లక్ష్మణుడు ముక్కు చెవులు కోసినంత వరకు మామూలుగానే ఉంది, ఆమె తరువాత లంకకు వెళ్ళక ఖరుడు, త్రిశిరుడు, దూషణుల కడకు వెళ్ళి తనకు జరిగిన పరాభవం చెప్పగా, వాళ్ళు అందరూ కలిసి పద్నాల్గువేల సైన్యంతో రామలక్ష్మణులపై యుద్ధానికి వస్తారు. ఆయుద్ధంలో అందరు చచ్చాక అప్పుడు లంకలోని రావణుని వద్దకు వెళుతుంది.

లంకకు వెళ్ళి తన ముక్కు చెవులు ఎందుకు కోశారో చెపుతూ 'అన్నా పంచవటి తీగాన గల ఆశ్రమంలో రాముని భార్య సీతను చూశాను. ఆమె అతిలోక సౌందర్యవతి. ఆమె రామునికి తగినది కాదు. నీకయితే తగిన జోడి. అందుకే సీతను నీకు భార్యగా చేద్దామని ఆమెను ఎత్తుక రావడం కోసం పంచవటి ఆశ్రమాని కెళ్ళితే ఆ రామలక్ష్మణులు నా ముక్కు చెవులు కోశారు. నీవు నిజంగా శూరుడవే అయితే ఆ రాముణ్ణి చంపి సీతను పెండ్లాడు.' అని అంటుంది. కాని తాను రాముణ్ణి మోహించమని అడిగిన సంగతి చెప్పదు.

ఇకపోతే జానపద రామాయణంలో శూర్పణఖ రామాయణం మొత్తంలో కనిపిస్తుంది. రామ రావణ యుద్ధానికి మంథర దారి చూపితే శూర్పణఖ నాంది పలికిందని జానపదుల అభిప్రాయం. జానపద రామాయణంలోని శూర్పణఖకు కూడా కొడుకు ఉంటాడు. కాని పేరు వేరు. భాస్కర రామాయణంలో జంబుకుమారుడని ఉండగా ఇందులో చక్రభూపాలుడు అని ఉంది.

ఈ చక్రభూపాలుణ్ణి లక్ష్మణుడు చంపాడని, పగ తీర్చుకోవడానికి ఆమె రంగప్రవేశం చేస్తుంది. తీరా పంచవటి ఆశ్రమానికి చేరుకున్న శూర్పణఖ రాముని మనోహర రూపాన్ని చూసి పగను మరిచిపోయి మోహాన్ని పెంచుకుంటుంది. అసలు తనొచ్చిన విషయమే పూర్తిగా మరిచిపోయి రామునితో తన్ను కామించమని అడుగుతుంది.

ఇక్కడినుండి కథ అన్ని రామాయణాల్లో లాగే వున్నది ముక్కు చెవులు కోయించుకున్న తరువాత రావణుని వద్దకు వెళుతుంది. రావణుడు శూర్పణఖను మొదటి ద్వారం దగ్గర రక్షణకు నియమిస్తాడు సీతాపహరణం తరువాత, సీతాన్వేషణకో హనుమంతుడు లంకకు చేరుకున్నప్పుడు, మొదటి ద్వారం వద్దే శూర్పణఖ హనుమంతుణ్ణి అడ్డగించగా అప్పుడు హనుమంతుడు ముక్కు చెవులు కోసి లంకలోకి ప్రవేశిస్తాడు

ఇలా జానపద రామాయణంలో శూర్పణఖకు రెండవసారి కూడా ముక్కు చెవులు కోయబడినట్లు వర్ణించబడి ఉంది. ఇది మాతృస్వామ్య వ్యవస్థ అంతరించి పితృస్వామ్య వ్యవస్థ నెలకొలటాన్ని సూచిస్తుంది. ఇక రామరావణ యుద్ధంలో రావణుడు మరణించాక కూడా శూర్పణఖ పాత్ర ఇంకా ఉంటుంది.

రావణుడు చచ్చినా ఇంకా నేనున్నాను అంటూ యతి వేషం వేసుకొని అయోధ్యకు వస్తుంది. సీతారామ దాంపత్యానికి పానకంలో పుడకలా అడ్డు పడింది శూర్పణఖ ఈ విధంగా జానపద రామాయణంలో కూడ శూర్పణఖను గడుసైన చుప్పనాతిగా చిత్రించారు జానపదులు.

ఇలా పలురామాయణాలలో పలువురు కవులు శూర్పణఖ పాత్రను వాల్మీకి రామాయణం ఆధారంగా తీసుకొని పలువిధాలుగా చిత్రీకరించారు. అందుకే ఈమె చుప్పనాతిగా పేరు పొందింది జనులలో ఆమె స్థానం శాశ్వతం. అసలు రామాయణంలో శూర్పణఖ పాత్ర లేక పోతే అసలు కథలో ఏమీలేదని నిస్సందేహంగా చెప్పవచ్చు.

ఉస్మానియా క్యాంపస్, హాస్టల్–ఎ/3
హైదరాబాద్–500 007.

# సరస్వతీ మధ్యాక్కరలు–
# ఒక పరిశీలన

పరమేశ్వరుని పాదారవిందాలపై మనస్సును లగ్నం చేయడాన్ని 'భక్తి' అంటారు. ఆదిశంకరులవారు. భక్తి అనే పదం 'భజ్' ధాతువు నుండి పుట్టింది. భక్తిఅంటే భజించడమని అర్థం. నారద భక్తిసూత్రాల్లోనూ, శాండిల్య భక్తి సూత్రాల్లోనూ భగవంతుని యెడగల పరమ ప్రీతియే భక్తియని చెప్పబడింది.

ప్రాచీన కాలం నుండి అర్వాచీన కాలందాకా ఎందరో మహానుభావులు భక్తిరస బంధుర కావ్యాలను వెల్లడించారు నాటినుండి నేటిదాకా భక్తిరస స్రవంతి అకుంఠితంగా అనుస్యూతంగా భారతీయ ప్రజల్లో ప్రవహిస్తూనే వుంది.

తెలుగు సాహిత్యంలో అన్నమయ్య పోతన్న భద్రాచలరామదాసు వంటి భక్తశిఖామణులు వెలయించిన సాహిత్యం నేటికీ ప్రజల నాల్కలపై జీవిస్తూనే వుంది. ఆధునిక యుగమున కూడా భక్తి సాహిత్యమును వెలువరించినవారు ఎందరో వున్నారు వారిలో ప్రసిద్ధకవి శ్రీదాశరధులబాలయ్యగారొకరు. వీరి కలం నుండి శ్రీరామచంద్రోదాహరణము, శ్రీసంగమేశ్వర వినుతి, శ్రీయాదగిరి నృసింహశతకము. శ్రీకోటిలింగేశ్వర శతకము, సరస్వతీ మధ్యాక్కరలు మున్నగు భక్తి కావ్యాలు వెలువడినవి. వీటిలో సరస్వతీ మధ్యాక్కరల గురించి పరిశీలించుట ప్రస్తుతకార్యము.

## మధ్యాక్కర లక్షణాలు:

తెలుగు సాహిత్యంలో అక్కరలైదు. అవి అవి మహాక్కర, మధ్యాక్కర, అంతరాక్కర, అల్పాక్కర. మధ్యాక్కర మధ్యాక్కరలో ప్రతి పాదమందు రెండుఇంద్రగణాలు ఒక సూర్యగణము మళ్ళీ రెండు ఇంద్రగణాలు ఒక సూర్యగణం ఉండాలి. ప్రాస నియమం ఉంటుంది. ఐదవ గణాద్యక్షరం యతిగావాడాలి.

క్రీ.శ. 9వ శతాబ్దంలోని యుద్ధమల్లుని బెజవాడ శాసనంలో మొదటి సారిగా మధ్యాక్కర కనిపిస్తుంది. నన్నయ భారతంలో కొన్ని మధ్యాక్కరలున్నాయి. ఎర్రన్న ఒక మధ్యాక్కర మాత్రమే వాడాడు. తర్వాత 20వ శతాబ్దం వరకూ మధ్యాక్కర జోలికి ఎవరూ పోలేదు. కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు మధ్యాక్కరకు మళ్ళీ పట్టాభిషేకం చేశారు. మరుగు పడిన మధ్యాక్కరకు మణి దీప్తులు తెచ్చిపెట్టారు. విశ్వనాథ తర్వాత ఎందరో ఆధునికులు మధ్యాక్కరల్లో రచనలు చేశారు. వారిలో విశ్వనాధ అచ్యుతదేవరాయులు, తుమ్మపూడి కోటేశ్వరరావు, ముళ్ళపూడి సచ్చిదానందమూర్తి, డా. కోవెల సుప్రసన్నాచార్య, డా. దాశరధుల బాలయ్య గారలు ప్రధానంగా చెప్పుకో దగిన వారు

తెలంగాణాలోని ఆదిలాబాద్ జిల్లాలో గోదావరి నది ప్రవహిస్తున్నది. గోదావరితీరంలోని 'బాసర' పురాణ ప్రసిద్ధమైన మహాక్షేత్రం. మహాభారత యుద్ధానంతరం వ్యాస మహర్షులవారు, దక్షిణ భారతానికి వచ్చి, ఈ పుణ్యక్షేత్రంలో తపస్సు చేసి సరస్వతీదేవి విగ్రహాన్ని ప్రతిష్ఠించాడు. అందువల్లే ఈ స్థలానికి 'బాసర' అనీ, 'వాసర' అని పేర్లు వచ్చాయి. వాసరేశ్వరి అయిన జ్ఞాన సరస్వతీదేవి మీద ఎందరో కావ్యాలు రాశారు. వారిలో డా. దాశరధుల బాలయ్యగారి 'జ్ఞాన సరస్వతీ మధ్యాక్కరలు' భక్తి భావ సంభరితమైనది.

ఈ సరస్వతీ మధ్యాక్కరల్లో మొత్తం వంద పద్యాలున్నాయి. 'జ్ఞాన సరస్వతీ! వాసరేశ్వరీ! దేవి' అనేది ప్రతి పద్యంలోనూ మకుటంగా కనిపిస్తుంది. ప్రతి పద్యం హృద్యమై పద్యఃపర నిర్వృతిని కలిగిస్తుంది. కవిగారి బాధ, ఆర్తి, భక్తి, శరణాగతి ప్రతి పద్యంలోనూ ద్యోతకమవుతుంది. బాలయ్యగారి భాషా పారిశుద్ధ్యము, కవితా వైశారద్యము ప్రతి మధ్యాక్కరలోనూ కనిపిస్తుంది. సూక్ష్మ పరిశీలనతో చూస్తే కవిత్వం ఉప్పొంగినట్లుగా వుంటుంది.

'నేనిట్లు నాల్గు మాటలను వ్రాయుట నీ మహత్వమ్మె ;
నేనిట్లు నాల్గు గీతములు పాడుట నీ కటాక్షమ్మె!
నేనిట్లు నాల్గు మెతుకులు దినుటయు నీ ప్రసాదమ్మె ;
హే నిత్య! జ్ఞాన సరస్వతీ! వాసరేశ్వరీ! దేవి!'

బాలయ్య గారి భక్తి, వారి కవితాశక్తి ఈ ఈ పద్యంలో తేట తెల్లమవుతుంది. నాల్గు మెతుకులు తినుట కూడా సరస్వతీదేవి ప్రసాదమే అని లలిత మనోహరంగా చెప్పటంలో వారి భక్తి ప్రపత్తి ఎంతటిదో తెలుస్తుంది. అహంకారుల కర్థంగాని మధుర మనోహర సత్యభావం ఇచట ప్రసాదగుణ శోభితమై ఇంపు నింపుతుంది. ఇది జ్ఞాన సరస్వతీ మహాత్మ్యము.

కవిగారు మొదటిసారి సరస్వతీదేవిని దర్శించి వచ్చినట్లూ, రెండవ పర్యాయం దర్శనానికి వెళ్ళినపుడు ఈ కావ్యం రచించి సమర్పించి వచ్చినట్లూ, ఈ పద్యం వల్ల తెలుస్తుంది.

'నిరుడు నీ గుడిచేరి యొక్క రాతిరి నిద్దుర సేసి కరములు మోడ్చి మ్రొక్కితిని, నేడొక్క కావ్యమ్ము వ్రాసి యరీతి నర్పించ వచ్చితిని...'

ఈ కవి ప్రప్రథమున శారదాదేవిని వివిధ నామములతో సంబోధించి స్తుతించి "విద్యయే నావంటి వానిని రక్షింప పెట్టనికోట విద్యయే లేకున్న నేను వెఱ్ఱిని" అని "విద్యాపరదేవతా, విద్యా విహీనః పశుః" అను ఆర్యోక్తులు స్ఫురించినట్లు వేడుకొన్నాడు తనపై జ్ఞాన సరస్వతీ కృపాదీధితుల ప్రసరించా లని తలంచాడు.

"ఘల్లుఘల్లుమనవలె నెదను నీరత్న కంకణ స్వనము
పలుకు పల్కున మ్రోగవలెను సప్తస్వరావళియు
నలరగావలె మృదు భావనముల శబ్దార్థము లందు"

అను పద్యంలో—తాను పలికే పలుకుల్లో సప్తస్వరాలు రవళించాలని తన హృదయ స్పందనలో కంకణ నిక్వాణం ధ్వనించాలని, తన శబ్దార్థాల్లో మధుర మంజుల మాధురీ మహిమ తొణికిసలాడాలని తీయని ద్రాక్షాపాకంతో వాసరేశ్వరిని అర్థించాడు కవి.

"కొంత వైరాగ్యమ్ము కొంత భక్తియు కొంత యర్చనము,"
"నా సహస్రార కమలమునందీమె నాట్యంబు సేయవే .. "
జ్ఞానయోగంబు, వైరాగ్యభావంబు సడం నీయకువే"....

వంటి పద్యాలలో బాలయ్యగారి యోగశాస్త్ర రహస్యాభిజ్ఞత, తాత్త్విక దృక్పథము, ముముక్షుత్వము ప్రకటింపబడినవి.

"వేయి కన్నులతోడ నిన్ను నాలోన వెదకుచున్నాను
వేయి నాల్కలతోడ నిన్ను నోరార బిలుచు

చున్నాను''

మొదలైన పంక్తులు సరళ జలవాహినిలా ప్రవహిస్తూ పాఠకుల చిత్తాలను అమోఘంగా ఆకర్షిస్తాయి.

''పావనంబైన నీనామ మెల్లప్డు పాడగానిమ్ము
తావకాశీర్వచధారలందున తడియగానిమ్ము
కైవల్య కాంతా గళంబునను పుస్తెగట్టగా
నిమ్ము.''

అనే పద్యంలో కీలకశబ్దం 'పుస్తెగట్టుట.' ఈ శబ్దం లేకుంటే పద్యం విరిగిపోతుంది. చక్రానికి ఇరుసు ఎంత ప్రధానమో ఈ పద్యంలోంఈ పుస్తెగట్టుట అనేశబ్దం అంత ప్రధానమైనది. పద్యమంతా ఈ శబ్దంచుట్టేతిరుగుతుంది. కవిగారి కవితా గృహంలో ఏమూలఏముందో తెలుసుకొనే సద్విమర్శకులకే ఈ రహస్యాలు తెలియవస్తాయి.

'ఈ దేవళమ్మొ వాకిటను నొసలినానించి
మ్రొక్కెదను
ఈ దేవళము చుట్టు తిరిగి చేతులనెత్తి
మ్రొక్కెదను...'

అన్నప్పుడు కవి దేవీ ఆలయం చుట్టు తిరుగుతూ, చేతులెత్తి మ్రొక్కిన వైనం కన్నులకు కట్టినట్లు వర్ణించబడింది.

వివిధ ఋతువుల్లో పూచిన పూలతో చదువుల తల్లిని అర్చించిన తీరు సౌందర్యాపాదకంగా వుంది,

'మల్లెపూవుల మాలదెచ్చి నీ కిత్తు మధుమాస
మందు చల్లని హేమంత మందు చంపక స్తబకమ్ము
నిత్తు ఫుల్లారవింద సూనముల నిరతమ్ము
పూజింత్తు నలువ యిల్లాల ! జ్ఞాన సరస్వతీ !
వాసరేశ్వరీ ! దేవి! '

అచ్చ తెనుగు పల్కి తేనెలూరించి పెట్టడంలో ఈ కవి ఎంత నిష్ణాతుడో, సంస్కృత సమాస నిర్మాణంలో అంత చేయి తిరిగిన వాడు. ఈ క్రింది పద్యంలో ఆయన కవిత్వ [illegible]ంత్వం ఎలా ప్రౌఢిమను సంతరించుకున్నదో చూడండి.

'నా నిత్య మోహ తమిస్ర నిర్వాణ జ్యోతి
నీవు !
నా నిఖిలామ పంకధుత దివ్య [illegible]కినివు
నీవు !
నా నేత్ర వికచ కల్హారయుగళ ప్రాణ
జ్యోత్స్నవు నీవు !
ఈనాడు జ్ఞాన సరస్వతి . వాసరేశ్వరి ! దేవీ'

తన శరీరం కర్పూరంగా కరగాలని, తన గుండె జేగంటలా మ్రోగాలని, తన బ్రతుకు వైజయంతిలా పరిమళాలు గుబాళించాలని కవిగారి అభ్యర్థన. రసపన్మనోహరమైన ఈ కవిత కళా కౌశలం పాఠకుల హృదయాలకు పరవశం కలిగించక మానదు. బాలయ్యగారి భావ తీవ్రతకు ఈ పద్యం మచ్చుతునక!

'కరగనీ నా శరీరంబు నిను జేరి కర్పూ
రంబుగ
మొరయనీ జేగంటవోలె నీ గుడిముందు నా
గుండె
వరలనీ యీ నాదు బ్రతుకు పరిమళ
వైజయంతియన
నిరవుగా, జ్ఞాన సరస్వతీ! వాసరేశ్వరీ దేవి"

బాలయ్యకవి అద్వైతి. తనకూ, తన ఉపాస్య దైవానికీ అద్వైతాన్ని ప్రతిపాదించిన భావన ఇతని కవిత్వానికి జీవనం !

నీవు మహా సముద్రంబవైనచో నే నూర్మి
నౌదు

నీవు శ్రీగంధ వృక్షంబవైనచో నే తావి
నౌదు

నీవు వాసంత బుపోలెవచ్చిన నే జైత్రునౌదు'

అని సామరస్యంగా అభివర్ణించారు.

'నీకంటె నాకు దిక్కెవరు లేరంచు నీ
కంటె వినవు

నీ కంటితో జూడు బ్రతుకునాయది నీకంటి తమ్మ
నాకొంటి లోకమాతవని యమృతలావా?
కొంటి పదము

లీకేళి—జ్ఞాన సరస్వతీ! వాసరేశ్వరి! దేవి'!

అట్టి మహోన్నత కవిశ్వరచన ఈ కాలంలో సృష్టి మనవచ్చు. దేవి తత్త్వమును ఉపదేశించుటకు ఇట్టి శబ్ద చమత్కృతులు అత్యంతా

'నెమ్మాన లోన నీవుండ బయట నన్వేషింప లాభమెయ్యది...' అనే సమాధానంతోద గూడిన ప్రశ్న! ఇంత చక్కని భావాన్ని ఒక చిన్న వాక్యమునందు సూచన చేసిన కవి మనోవానుడుగా దర్శనమిస్తున్నాడు.

ఈ పుస్తకంలో ప్రయుక్తమైన కొన్ని పలుకుబడులు :— నిరుడు, మొలక నవ్వు, చలువవెన్నెల, అందచంద, నాటగోలె, నిమ్మళమాయె, పుస్తెగట్టు, పౌడ, సోమించి, రౌద, గోము, పోకిళ్ళు, సుమారించు, చిల్లివడ్డది, చిన్నమెత్తు, పిలిసీదలు, పట్టపగ్గములు.

జాతీయాలు :—అన్నెము పున్నెము నెరుగ, చీటికి మాటికి, చీకుచింతలు, పిండికొద్దిరొట్టె, అడవిగాచిన వెన్నెల, నట్టేటిలో పుట్టిముంచినట్లు, పొద్దుపొడిచినట్లు, పూవులమ్మిన చోట కట్టెలమ్మిన రీతి—మొదలగునవి.

ఈ కావ్యంలోని మరికొన్ని మధుర కవితా పంక్తులు—

'భావన నిన్నెచుంచాడు వాంఛని భాగ్యంబు
గదె'

'నాకున్న పనియేమి కూరుచుండి ధ్యానము
సేతునిన్ను'

'నా యూహాలో వెలుంగు పదముల తోడ
నడచి రావమ్మ'

'నీ పాద నూపురస్వనము నా యింట నిన
దించవలయు'

'ప్రొద్దు పొడిచినట్లున్న నిను జూచి పొంగ
పోయెదను'

నా కామధేనువా! నిన్ను వర్ణించ నాశక్య
మగునటే'

'ఒకసారి నా ఫాలమందు నిను గన్నట్టు
లూహించుచుందు'

'ఈమేన నీవయై పోయినావు బ్రాహ్మి?
సౌఖ్య మహాహా?'

'నా జీవన జ్యోతి పీన వాణి! నీ జ్ఞాన
ప్రసూన మీ జీవి...'

ఈ విధంగా దాశరథుల బాలయ్యగారి సరస్వతీ మధ్యాక్కరలు లలిత సుందరంగా, మధుర మనోహరంగా సాగుతూ, కవి ఆత్మీయతను అనుభూతినీ ఆవేదననూ పాఠకుని కందిస్తాయనడంలో సందేహం లేదు. దీనిలో ఆత్మిక చింతన, సర్వ రసాత్మకానందము, వాగ్దేవి రూప గుణ నామ సంస్తుతి చోటు చేసుకొన్నది. ఇంత చక్కని కృతి తెలుగు సాహితీ లోకానికి అందించిన బాలయ్య కవి సుకృతి యని చెప్పవచ్చు. సాహితీ చరిత్రలో సరస్వతీ మధ్యాక్కరలకు సముచిత స్థానం ఉంటుందని ఆశిద్దాం!

జి. విద్యాధరి
ఇంటి నెం. 5–4–37 భవానికాలనీ,
రాజేంద్రనగర్, హైద్రాబాద్–500 030.

# పుస్తక సమీక్ష

## స్త్రీ జన్మసాక్షిగా

సమాజంలోని సామాన్యుల బాధాగాథలను, అసామాన్యుల అద్భుత గాథలను సాహిత్యంద్వారా మళ్ళీ సమాజానికి అందించే మహాత్ముడు రచయిత. మనిషి మనస్సులో సమాజాన్ని గూర్చిన ఆలోచనలను రేకెత్తించటానికి ఆకర్షణీయమైన కవిత్వం ద్వారా కవి చేసే ప్రయత్నమే కవితా రచన. తన రచనల ద్వారా సహృదయ పాఠకులను ఆలోచింప జేస్తున్న, ఆనందింపజేస్తున్న సత్కవి శ్రీ కాట్రగడ్డ లక్ష్మీనరసింహారావు. గత ముప్పైసంవత్సరాలుగా సగటున సంవత్సరానికొక కవితా సంపుటినైనా ప్రచురించి సాహిత్యసరస్వతి నర్చిస్తున్న సాహితీ సేవకులు కాట్రగడ్డ లక్ష్మీ నరసింహారావు. తన గ్రంథాలను తాను ప్రచురించు కోవటం పెద్దగొప్పా? అని కొందరనుకోవచ్చు. కాని కాట్రగడ్డవారు సాహిత్యాభిలాషతో ఇతరుల గ్రంథాలను గూడా ఎన్నిటినో ప్రచురించారు. నిజంగా ఇది ఎంతో అభినందనీయమైన విషయం.

కాగా, కాట్రగడ్డగా ప్రసిద్ధినందిన లక్ష్మీ నరసింహారావుగారు ఇటీవల ప్రచురించిన కవితా సంపుటి 'స్త్రీజన్మసాక్షిగా! ఈసంపుటిలోని 26 ఖండికలలో ఒక ఖండికపేరే ఈ సంపుటికి నామ దేయమైంది. ఈసంపుటిలోని ఖండికలు సమాజం లోని మంచిచెడులను కవితామయంగా వివరించేవే

ఈ ప్రపంచంలో కులభేదాలు, మతభేదాలు విషభుజంగాలై విహరిస్తున్నాయి. ఆకలితో నకనకలాడే పొట్టల హాహాకారాలు వ్యాపిస్తున్నాయి. నిరుద్యోగం, వరకట్నం కత్తులు ఝళిపిస్తున్నాయి. 'అంగడిలో అంగాంగాలను ప్రదర్శిస్తూ, పొట్టకూటికై కాముకులకు సంతృప్తినిస్తూ 'రోజా రోదించే రోజాలై' జీవిస్తున్నారు వేశ్యలనబడే యువతులు. కర్షకుల, కార్మికుల జీవితాలు కష్టనష్టాలకు కాపురాలౌతున్నాయి. ఇలా సంఘంలోని వివిధ

---

స్త్రీ జన్మ సాక్షిగా—కవితా సంపుటి
పుటలు : 8+32
వెల : లేదు
ప్రతులకి : కవితా జ్యోతి పబ్లికేషన్స్
ఏలూరు–534003 ఆంధ్ర

---

వ్యక్తుల జీవితాలలోని విశేషాలకు కవితారూపాన్నిచ్చి సహృదయుల మనస్సులను తాత్కాలికంగానైనా ఆలోచనా పూరితం చేశారు. కాట్రగడ్డవారుసాహిత్యం సమాజానికి దర్పణం అన్న పెద్దల వాక్యానికి నిలువుటద్దం పట్టా కాట్రగడ్డవారు.

కాట్రగడ్డవారు గొప్ప దేశభక్తులు. ఈలోకంలో కన్పడే లోపాలను విమర్శిస్తూ కవితలల్లినట్లుగానే ఈదేశంలోని సుగుణగణాలను కూడా గొంతెత్తి గానం చేశారు.

'సమయం చిగురిస్తున్నది
సహనం బలపడుతున్నది

చిరునవ్వుల పూతలతో
రేయిబవలు నర్తిస్తున్నవి.'

వీరి గీతాలలో కొన్ని, గానానుకూలాలు ప్రభువా ప్రభువా వంటి గీతాలు ఇందుకుదాహరణలు. వీరు దేశభక్తులైన వారిలాల సద్గుణాలను కీర్తించారు. పిఠాపురం శ్రీ 'రా'గారు సమాజంలోని మంచి చెడులను సమానంగా వర్ణించే కవి అని అర్థమౌతున్నది.

కాట్రగడ్డ వారికి శబ్దాలంకారాలపైన ప్రీతి ఎక్కువ. శబ్దాలంకారాలు రచనకు అందం చేకురుస్తాయనటంలో సందేహం లేదు.

'నా తెలివియె నీ కలిమి
నా బలిమియె నీకు కలిమి'
'బంగారం బంతులాట
అంగాగం షేర్ల వేట'

వంటి అంత్యప్రాసలతో నిండిన పాదాలు ఈ సంపుటిలో మెండుగా ఉన్నాయి. 'ఉప్పు కల్లు, ఊబిగుంటల్లో ఉండి ఉచ్చుల్లో వంటి పేకాక్షరాది పదాలను ప్రయోగించటం గూడా దండిగా ఉంది.

అయితే ఒక్కసారి వీరు భావావేశంతో ప్రాసావేశంలో పదసాదృశ్యాన్ని లెక్కించరు. శిలారోదనాదసహిత—దేవాలయ దారుల—స్వర సంగీత మెట్లు—నుదుటిపై నొసటితో ప్రజారథం వీచికలు—మెరుపువులు—సుఖశయ్యల మదక నయన చూడ్కులు ప్రాంతీయ గంతులు వంటి పదబంధాల విషయంలో జాగ్రత్త అవసరం. కాలం ముల్లులా గుచ్చుకుంది. అన్ని ఆలోచనాత్మకమైన పాదం వెంటనే వాలం పట్టి లాగిందెవరు? అన్న పాదం కాలం వాలం అనే పదాలపై మోజుతో చేసినట్లనిపిస్తున్నది.

ఈ బాహ్యాలంకార వ్యామోహం తగ్గించుకుంటే ఇంకా ఎన్నెన్నో మంచి ఆలోచనాత్మక రచనలను కాట్రగడ్డవారు వెలయించగలుగుతారు.

కూర్చొన పెట్టిన సుమారు 30 మంది హిందీ ప్రచారకులకు, శ్రీ ఎ.కె. ఖాన్ ఐ. పి. ఎస్. గారిచే సన్మానములు జరిగినవి. తదుపరి శ్రీ అన్నదానం రామస్వామి గారు శ్రీ ఎ.కె. ఖాన్ గారిని సన్మానించిరి.

తదుపరి దక్షిణ భారత హిందీ ప్రచార సభకు విశిష్ట సేవ చేసి పదవీ విరమణ చేసిన హిందీ ప్రచారకులను, సూపర్ బజార్ చైర్మన్ శ్రీ వై. డి. రామారావు గారు సన్మానించిరి. శ్రీ వై. డి. రామారావు గారిని దక్షిణ భారత హిందీ ప్రచారసభ ప్రధాన కార్యదర్శి శ్రీ అన్నదానం రామస్వామి గారు సన్మానించిరి.

తూర్పు గోదావరి జిల్లా అమృతోత్సవ మహాసభల సందర్భముగా విచ్చేసిన దక్షిణ భారత హిందీ ప్రచార సభ ప్రముఖ కార్యవర్గ సభ్యులను, ప్రముఖ వాణిజ్యవేత్త శ్రీ దంటు సూర్యారావు గారు, శ్రీ పెండా విశ్వనాథ కుమార్ గారు సన్మానించిరి. వీరిరువురిని సభ తరుపున శ్రీ అన్నదానం రామస్వామి గారు సన్మానించిరి. తరువాత ఈ అమృతోత్సవ మహా సభలు దిగ్విజయముగా జరుగుటకు సహకరించిన ఆహ్వాన సంఘ సభ్యులను దక్షిణ భారత హిందీ ప్రచార సభ అధ్యక్షులు శ్రీ తోయపాటి నాగేశ్వరరావు గారు సన్మానించిరి. శ్రీమతి ఎమ్. వేదవల్లి గారు మరియు శ్రీ పలకా మహేశ్వర రావు గారు వందన సమర్పణ చేసిరి.

## గాంధీ జయంతి ఉత్సవము అనంతపురం

జాతిపిత మహాత్మాగాంధీ 125వ జయంతి ఉత్సవాన్ని పురస్కరించుకొని జాతీయ భాష హిందీ (అమృత హిందీ మౌలిక్) పరీక్ష ప్రమాణ పత్ర వితరణోత్సవము, స్థానిక వికలాంగుల సంక్షేమ బాలుర వసతి గృహమునందు జరుపబడినది.

సభకు, వసతిగృహ సంరక్షకులు శ్రీ యం. మంజునాథ్‌గారు అధ్యక్షత వహించిరి. వారు తమ ఉపన్యాసంలో జాతీయభాష హిందీ ప్రాముఖ్యతను అభ్యసించవలసిన అవశ్యకతను వివరించిరి.

స్థానిక హిందీ ప్రచారకులు శ్రీ ఎ. బి. ఉమాశంకర్ (H A G J C Proys, అనంతపురం) గారు, భారతదేశ స్వాతంత్ర్య పోరాట సందర్భంలోనే, జాతీయభాష అవశ్యకతను వివరించి, గాంధీ గారి ఆశీస్సులతోనే 75 సం. ల. తర్వాత కూడా ద.భా.హిందీ ప్రచారసభ, మద్రాసు హిందీ భాషా ప్రచారం కొనసాగుతున్నదని, ప్రస్తుతము సభ అమృతోత్సవం జరుపుకొను చున్నదని తెలిపిరి.

గాంధీజీ భజనతో సభ ముగిసెను.

## పెద్దపాటి నాగేశ్వరరావు గారి సన్మానోత్సవం

ది. 31. 10. 94న పెదరావూరు జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో పనిచేయుచున్న ప్రథమశ్రేణి హిందీ పండితులైన శ్రీ పెద్దపాటి నాగేశ్వరరావు గారికి పదవీ విరమణ సన్మానసభ ప్రముఖ న్యాయవాది శ్రీ పొలదుగు సీతారామయ్య గారి అధ్యక్షతన ఘనముగ జరిగినది.

పాఠశాల ప్రధానోపాధ్యాయులు సర్వశ్రీ వెలువోలు మదనమోహనరావుగారు సభా వరి

చయము చేసిరి సభాధ్యక్షులు శ్రీ సీతారామయ్య గారు మాట్లాడుతూ అన్ని వృత్తులకంటెఉపాధ్యాయ వృత్తి ఉత్తమమైనది అన్ని దానములకన్న విద్యాదానము మిన్నయైనది అటువంటి వృత్తిని సాగించి శ్రీ పి నాగేశ్వరరావు గారు ఉత్తమ ఉపాధ్యాయునిగ పదవీ విరమణ చేయుచున్నారు అనిరి విజయలక్ష్మి దేవిగారు సన్మాన పత్రము చదివి సన్మానితునికి బహూకరించిరి.

తదుపరి ముఖ్య అతిధి దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఆంధ్రప్రదేశ్ అధ్యక్షులు శ్రీ బోయ పాటి నాగేశ్వరరావు. శ్రీ పెద్దపాటి నాగేశ్వరరావు గారికి పూలమాలవేసి చందనతాంబూలం అందించి శాలువకప్పి ఘనంగ సన్మానించిరి పాఠశాల సహోపాధ్యాయులు శ్రీ అబ్దుల్ సత్తార్. యస్. అన్నపూర్ణ నాగేశ్వరరావు గారికి నూతనవస్త్రములు మెమెంటోలు బహూకరించిరి విద్యార్థులు బోధ నేతర సిబ్బంది మెమె టోలు నూతన వస్త్రములు బహుకరించిరి. హైదరాబాదు నవశక్తి ఆర్ట్ థియే టర్సు తల్లి దండ్రుల ఉపాధ్యాయుల సమాఖ్యవారు వీరబ్రహ్మేంద్రస్వామి వారి ఆలయ సమాజమువారు శ్రీ జాస్తి జగన్‌మోహనరావుగారు, నాగళ్ళ బాబూ రావుగారు సన్మాన పత్రము నూతన వస్త్రములు మెమెంటోలు పూలవర్షముల మధ్యలో బహూక రించి భక్తిశ్రద్ధలను చూపిరి తదుపరి ప్రముఖ వ్యాపార వేత్త శ్రీ కొడాలి మాధవరావు రిటైర్డు H.M కొడాలి ప్రసాదరావుగారు ధ్వాని జి. ప.ఉ పా ప్రధానోపాధ్యాయులు పిమ్మమొలకల వాలేశ్వరరావుగారు, రిటైర్డు H M కుర్రా వెంక టేశ్వరరావుగారు పాఠశాల చీఫ్ జోనల్ జిల్లా గ్రంథాలయ సంస్థ మాజీ అధ్యక్షులు కొత్తపల్లి ఉమామహేశ్వరరావుగారు తమ సందేశములు ఇచ్చిరి శ్రీ బోయపాటి నాగేశ్వరరావుగారు మాట్లా డుతూ శ్రీ పి నాగేశ్వరరావుగారు అంకిత భావముతో తమ ఉపాధ్యాయ వృత్తిని కొనసాగించిరి. ఉపాధ్యాయ సంఘములో పనిచేయుచూ ఉపాధ్యాయ ఉద్యమమును నడిపించిన కార్యకర్త, అని ప్రసం గించిరి. నాగేశ్వరరావుగారు మచ్చలేని ఉపాధ్యాయు లని. చదువు అనేది విజ్ఞానము కొఱకుగానీ ఉద్యో గము కొఱకు కాదు అని శ్రీ ఉమామహేశ్వరరావు గారు అన్నారు

శ్రీ నాగేశ్వరరావుగారు విధినిర్వహణయే ఘనతకు మార్గం" అను సూక్తిని తు చ. పాటించిన ఉపా ధ్యాయులు అని శ్రీ కుర్రా వెంకటేశ్వరరావుగారు అన్నారు రాష్ట్ర ప్రభుత్వ ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత శ్రీ తూమాటి వెంకటేశ్వర్లు మాట్లా డుతూ శ్రీ నాగేశ్వరరావుగారు పాఠశాల విధులతో పాటు పాఠశాల పురోభివృద్ధికి పాటుబడిన వారు అని శ్లాఘించిరి. గుంటూరు జిల్లా ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ కార్యదర్శి యం. రామన్నగారు మాట్లా డుతూ శ్రీ నాగేశ్వరరావు గారు అధ్యయనము అధ్యాపనము సామాజిక స్పృహ భావములతో పనిచేసి అందరిచేత మన్ననలు పొందిరి అన్నారు.

సన్మానితులయిన శ్రీ పెద్దపాటి నాగేశ్వర రావుగారు ధన్యవాదములు చెబుతూ ఉపాధ్యాయ వృత్తి ధర్మమును గురించి తను వృత్తిని ఉప వృత్తిగగాక ప్రథమవృత్తిగ భావించి విద్యార్థులను తీర్చి దిద్దాలని సందేశము ఇచ్చిరి. చివరగ పాఠ శాల సాంఘిక శాస్త్రోపాధ్యాయులు శ్రీ వీసం నరసింహారావుగారు వందన సమర్పణ గావించిరి.

అందమైన ముద్రణకు

# దక్షిణ భారత ప్రెస్

ఖైరతాబాద్, హైద్రాబాద్–4



* తెలుగు
* హిందీ
* ఇంగ్లీషు
* సంస్కృత

భాషలలో ముద్రించబడును.

ఫోన్ : 317478

Edited Printed and Published by A. Sankara Sastry on behalf of the D. B. Hindi-Prachar Sabha-Andhra, Khairatabad, Hyderabad-500 004.
and Printed at Dakshin Bharat Press, Khairatabad, Hyderabad–500 004.